



# గీతం-గీత

## (పాటల జ్ఞానము)


రచించినవారు

**ప్రబోధాశ్రమ భక్తులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-40 ద్వితీయ ముద్రణ : మార్చి-2018

ప్రతులు : 1000 **వెల : 200/-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్దమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
92) బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మములో రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) సుప్రసిద్ధి బోధ.
98) రూపము మారిన గీత.
99) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
100) సున్న.
101) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.

80. పుట్టుట–గిట్టుట.
81. ఏకత–ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ – నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు – లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట–దోబూచులాట.
90. ప్రజలు–మానవులు.
91. దంతము–అంతము.
92. మతము–పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము–అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము – బోధ.
97 ప్రభువు–ప్రభుత్వం.
98. జ్ఞానము–విజ్ఞానము.
99. వార–మాస–వత్సర.
100. భూతం–మహాభూతం.
101. సేకూవలి–కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు–పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము–గ్రంథము.
108. హరికాలు–హరచేయి.
109. పుట్టగోసి–మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము–శరీరము.
113. దివ్యఖురాన్–హదీసు.
114. ఇందువు–హిందువు.
115. సుఖము–ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము–అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ–మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము–మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు–మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర–మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి–అమావాస్య.
134. ఈశ్వర–పరమేశ్వర.
135. ఆధ్యాత్మిక ప్రశ్నలు–జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

08



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# గీతం - గీత

చిత్రము : **మేఘ సందేశం (1983)**

పాట : **ఆకాశదేశానా-ఆషాఢమాసాన**

కర్మాల నీడాన, కష్టాల రూపాన, నలిగేటి ఓ జీవమా, నలిగేటి ఓ జీవమా...

కామమో క్రోధమో ఎనలేని మోహమో

వినిపించు నీహృదికీ జ్ఞానసందేశం జ్ఞానసందేశం

చ॥ మామగారి కోడలివై, కన్నవారి కూతురువై

మామగారి కోడలివై, కన్నవారి కూతురువై

ఈ జగాన పాత్రలలో, కరిగి నీవు నిలిచావనీ, కడలివోలె మిగిలావని

తరగని కరగని సారముతో, తెలిసిన పలుకుల భావముతో

విన్నవించు నీ హృదికీ, జ్ఞానసాధనా, నా పరమసాధనా

కర్మాల నీడాన, కష్టాన రూపాన, నలిగేటి ఓ జీవమా, నలిగేటి ఓ జీవమా...

కామమో, క్రోధమో, ఎనలేని మోహమో

వినిపించు నీ హృదికీ జ్ఞానసందేశం జ్ఞాన సందేశం

చ॥ రాలిపోవు తనువునకై, వీడిపోవు జీవునవై

ఈ కసాయి కాలములో నివురులాగ మిగిలావని, శిథిల జీవివైనావని

పలికిన పలుకుల సారముతో, మధుర భావ జలధారలతో

విన్నవించు నీహృదికీ, మనోసాధనా నా జ్ఞాన సాధనా

కర్మాల నీడానా, కష్టాల రూపాన నలిగేటి ఓ జీవమా, నలిగేటి ఓ జీవమా...

కామమో క్రోధమో ఎనలేని మోహమో

వినిపించు నీహృదికీ జ్ఞానసందేశం జ్ఞానసందేశం

చిత్రము : **స్వయంవరం (1982)**

పాట : **గాలి వానలో వాన నీటిలో**

కాలవీధిలో బ్రతుకుబాటలో తనువు ప్రయాణం
జన్మమెక్కడో, కర్మమేమిటో తెలియదు పాపం, తెలియదుపాపం

చ॥ ఇటు ఘోరకర్మమని తెలుసూ, అటు మరల జన్మమని తెలుసూ
ఘోరకర్మతో మరల జన్మలో సాగలేనని తెలుసూ
ఇటు పాడు మాయయని తెలుసూ, అటు బాధ సుడులని తెలుసూ
పాడు మాయలో బాధసుడులలో మునక తప్పదని తెలుసు
అయినా తనువు ప్రయాణం జన్మమెక్కడో, కర్మమేమిటో తెలియదు
పాపం, తెలియదుపాపం

చ॥ మది ఆశనిరాశల ఆరాటం, హృది చీకటి వెలుగుల చెలగాటం
ఆశజారినా వెలుగు తొలగినా ఆగదు జీవిత పోరాటం
ఇది మనిషీ మనసుల పోరాటం, అది తనువూ ఆత్మల చెలగాటం
జ్ఞానదూరమై మనసు చపలమై బ్రతుకుతున్నదొక శవం
అయినా తనువు ప్రయాణం జన్మమెక్కడో, కర్మమేమిటో తెలియదు
పాపం, తెలియదుపాపం
కాలవీధిలో బ్రతుకుబాటలో తనువు ప్రయాణం
జన్మమెక్కడో, కర్మమేమిటో తెలియదు పాపం, తెలియదుపాపం

చిత్రము : **బందిపోటు (1963)**

పాట : **ఊహలు గుసగుసలాడె**

ఆశలు మరిమరి రేగే, మా హృదయము ఆరడిచేసే

చ॥ విడలేము మనసున మోహము
ఘనమైన జ్ఞానము కోసము
నీ మాయలో, బలముందిలే
అది మాకు ముందే తెలుసు
ఆశలు మరిమరి రేగే, మా హృదయము ఆరడిచేసే

చ॥ తుదిలేని ఈ సంసారం
విడలేని బంధమదాయె
నీ జ్ఞానము, లేకున్నచో, విడలేము కర్మము కూడా
ఆశలు మరిమరి రేగే, మా హృదయము ఆరడిచేసే

చ॥ నిను చేరి కొలచినవేళ
మనసేమో నిలచెను మాలో
హృదియోగమూ, మదిజ్ఞానమూ, వెలసెను మాలో
ఆశలు మరిమరి రేగే, మా హృదయము ఆరడిచేసే

| చిత్రము : **నిప్పులాంటి మనిషి (1974)** |
| --- |

పాట : **స్నేహమే నా జీవితం స్నేహమేరా శాశ్వతం**

జ్ఞానమే నా జీవితం....., జ్ఞానమేరా శాశ్వతం....
జ్ఞానమే నాకున్నదీ..... జ్ఞానమే నా పెన్నిధి....
జ్ఞానమే.... హెూయ్.... జ్ఞానమే నా జీవితం...జ్ఞానమేరా శాశ్వతం

చ॥ 1) గురువునే దూషించితే.... కోటి జన్మలు కలుగుతాయి
గురువునే సేవించితే... జన్మ కర్మలు తొలగుతాయి
గురువును సేవించు ఓయీ.. లేదు అంతకు మించిముక్తి
జ్ఞానమే నా జీవితం....., జ్ఞానమేరా శాశ్వతం....
జ్ఞానమే నాకున్నదీ..... జ్ఞానమే నా పెన్నిధి....

2) దివ్వెలా వెలిగేటి చురుకైన జీవాత్మ
చిక్కుబడి పోయింది జన్మలో ఈనాడు
ఏమిటో ఈ కర్మా........
ఏమిటో ఈ కర్మ.... ఇకనైన చూడవోయీ....
ఆ రహస్యమ్ కాస్త ఇకనైన తెలియవోయీ...
నిండుగా నీవు ముక్తి పొందాలి.... అందుకు నీకు నేను చెప్పాలి

కోర్కెలను లేకుండా చేయమంటాను.... అహమును తీసేయమంటాను

చంపమంటానూ........

చంపమంటానూ......... ఆ మనసూను.....

త్రుంచమంటానూ..... ఆ గుణముల......

ఏమి చేయాలన్న చేయాలి, కోరితే ప్రాణమైన ఇవ్వాలి

గురువంటే పరమాత్మా......

గురువంటే పరమాత్మ...... నీవంటే జీవాత్మ

ఒక్క జన్మే చాలు వచ్చులే మోక్షాము.......

పొందెరా........

పొందెరా మోక్షాము........ పొందెరా నిండుగా

పొందెరా జీవుండు....... పరమాత్మయంతటా

జ్ఞానమే నా జీవితం....., జ్ఞానమేరా శాశ్వతం....

జ్ఞానమే నాకున్నదీ..... జ్ఞానమే నా పెన్నిధి....

## రేడియో పాట, ప్రైవేట్ సాంగ్

పాట : **బిందంటే బిందెకాదురా, ఓపాపోద బిందె ఖరీదు చెప్పురా**

ఆత్మంటే వేరులేదురా... ఓ జీవుడా ఆత్మాజ్ఞానము తెలియర

అందు నిందు సందులేదు, అంతటా నిండియుంది

నీవు చేసిన కర్మలకు, తెలియకుండ పోయినాది

1) గురువంటే మనిషి కాదురా... ఓ జీవుడా గురువంటే దేవుడేనురా

జ్ఞానాము చెప్పువాడు, కర్మాలు బాపువాడు,

నీకున్న గుణములకు, తెలియకుండా పోయినాడు. ॥ఆత్మంటే॥

2) కర్మంటే ఏమోకాదురా.......... ఓ జీవుడా నీవు చేసే పనులేనురా

నీవు చేసే పనులకు, పాపపుణ్యములొచ్చినాయి

నీకున్న మూర్ఖతకు తెలియకుండ పోయినాయి. ॥ఆత్మంటే॥

3) మనసంటే వేరేలేదురా........ ఓ జీవుడా నీలోని జ్ఞప్తియేనురా
ఆలోచన చేయునాది, అంతటా పోవునాది
గాలికంటే వేగమైనాది, చెప్పకుండా పోవునాది ॥ఆత్మంటే॥

4) అహమంటే ఏమోకాదురా...... ఓ జీవుడా నేనను భావమేనురా
అహమాను భావముండె, కర్మాలు తెచ్చిపెట్టె
దానీని తెలియవోయి, ఓ మూఢ జీవుడా ॥ఆత్మంటే॥

5) స్వామి అంటే ఎవరోకాదురా........ ఓ జీవుడా జ్ఞానాము చెప్పువాడురా
వేసాలు వేయనోడు, గడ్డాలు పెంచనోడు
పూసాలు కట్టనోడు ప్రబోధ గురవేను ॥ఆత్మంటే॥

చిత్రము : **పూజాఫలం (1964)**

పాట : **పగలే వెన్నెల – జగమే ఊయల**

అహమూ మానరా....... ఇహమూ మాయరా
పరమే శాశ్వతమని మరువబోకురా.....ఆ........ఆ...........ఆ....

1) ఆత్మలోన, అంధకారం, అలముకొనేరా
జ్ఞానజ్యోతి, వెలుగజేసి, ప్రారద్రోలరా
ఆత్మకు, నాశమూ, లేనేలేదురా
ఆత్మయే, పరమాత్మ, రూపమౌనురా ॥అహము॥

2) నిత్యమైన, ముక్తిమార్గ, మరయవేల
సత్యమైన, సూక్తులను, నమ్మవేల
గురువుకు, జ్ఞానము, రానేరాదురా
గురువే, పరమాత్మ, జ్ఞానమౌనురా ॥అహము॥

3) కామక్రోధ, లోభమోహ, మధమత్సరం
ఆర్గురూ, శత్రులనే, అర్ధమెరుగరా
జ్ఞానమె వాటినీ అణచెడుశక్తిరా
రయమున జ్ఞానమార్గ మరయరారా ॥అహము॥

4) విశ్వరూప పరమాత్మ ముక్తిదాయక
జ్ఞానదీక్ష నొసగిమమ్ము ఆదరించవా
యోగి శుభకరా జ్ఞానము నీయరా
రయమున యోగదారి చూపరారా ॥అహము॥

చిత్రము : **ఇద్దరు మిత్రులు (1961)**

పాట : **ఖుషీ ఖుషీగా నవ్వుతూ**

దయామయా నీ జ్ఞానమే, తలంచు వారికి కర్మలే
భష్మమవుగా వెంటనే, యోగి ప్రబోధానందా

1) జ్ఞానముతోనే, మదిలోదల్చి, యోగదీక్షనే పూని
ఆరు చక్రముల, దాటివత్తురే, నీదురూపమే చూడ ॥దయా॥

2) పేదా ధనికా, భేదమెందునా, లేదు ఆత్మకు సత్యము
ఆత్మలోనె, మైమర్చియుండిన, బ్రతుకు వారిదే ధన్యము ॥దయా॥

3) కష్టాలన్నీ, జ్ఞానశక్తితో, చక్కచేతువేస్వామి
ఒక్కసారి, నీ బోధవిన్ననూ, ధన్యమేకదా స్వామి ॥దయా॥

4) గ్రంథములెన్నో వ్రాసినావుగా, జ్ఞానశక్తితో స్వామి
నీదుసాటి ఏ గురువునెరుగము ధరణిలోనే మా భాగ్యము ॥దయా॥

చిత్రము : **మంగమ్మ శపథం (1965)**

పాట : **కనులీవేళ చిలిపిగనవ్వేను.**

గురు ప్రబోధ, దయగను, మంటిమి
నిను మనసార కొలిచెద మంటిమి
గురు రాజ సజ్జనపోష నీవంటిమి
గురు రాజ సజ్జనపోష నీవంటిమి

1) ఏది తలచిన మామనసునందు
నీకే కాదా అర్పణమందు
మోద మలరగ నీ జ్ఞానమంతా
విధిగ చేతుము యోగంబుగా ॥గురు॥

2) సకల ప్రాణుల సాక్షుండనీవే
అఖిల జ్ఞానాల నిలయుండ నీవే
నాకు ముందుగ పూజ్యుండ నీవే
నీదు జ్ఞానమె జపియింతునూ ॥గురు॥

3) అండ పిండా బ్రహ్మాండమందూ
నీవె కాదా నిండియుండ
కోరి నిన్ను కొలిచేము స్వామి
నీదు కరుణా చూపించవా ॥గురు॥

చిత్రము : **గూడుపుఠాణి (1972)**

పాట : **తనివి తీరలేదే**

సిద్ధాంత గీతబోధా....... బోధించువాడనీవా
మూఢుల బ్రోవ.....రావేల......... గురువా...........
ఓ గురువా............ఆ........ఆ........ఆ

1) నిన్నే నమ్మితి నా మదిలో.........
నిరతము సేవలు చేసెదము....
నిన్నే నమ్మితి ఓ గురువా............
సన్నుత పావన మా స్వామీ..........
జ్ఞానమూ మాపైనా....... కురియగా రావయ్యా
కఠినమూ నీకేలా...... సరగున దయగనరా ॥సిద్ధాంత॥

2) ఎప్పుడు నీవేమాతో యుంటే.....
ఎన్ని యుగాలైతే నేమి.......

కన్నుల నీవే కనబడుచుంటే........
ఎన్ని జన్మలు వస్తేనేమి.......
అందనీ మోక్షములో.......అంతటా యుండెదమూ
తెలియనీ దేవునిలో..... తెలిసీయుండేము ॥సిద్ధాంత॥

చిత్రము : **నిర్దోషి (1967)**

**పాట : మల్లియలారా, మాలికలారా**

సద్గురు దేవా..... మా పాలి స్వామి........
యోగములోయున్నారా......... మా విధినే చూచారా.....

1) మనసులోనే, బాధలు రేగె...
చిత్తములోనే, చింతలు మూగే
జ్ఞానమూ లేక, కర్మముపోక
బ్రతుకే మాకు, బరువైసాగే ॥సద్గురుదేవా॥

2) రేగిన మనసు, నిలుపుటకొరకు
చేరితిమయ్యా, నీదరిలోన
ఆత్మానందా, కావగరావ
నీవే మాకు గురువైరావ ॥సద్గురు॥

3) ఆశ్రమమంతయు, భక్తులు నిండ
కోరిన బోధా, చెప్పితివయ్యా
హృదయము పొంగ, కర్మము కృంగ
బ్రతుకే నీలో, రథమై సాగే ॥సద్గురు॥

4) నిదురతోనే, నిండిన మేము
కంటిమి నిన్నే, కన్నుల విందుగ
జ్ఞానమెకల్గి, అహమే పోయి
బ్రతుకే మాకు యతిగా సాగే ॥సద్గురు॥

## చిత్రము : **బందిపోటు (1963)**

పాట : **వగలరాణివి నీవే**

కర్మ జీవివి నీవే - దైవ ఆత్మను నేనే
కర్మకాలెను - ఆత్మ దొరికెను - ముక్తి వచ్చెనులె

1) ఆత్మ జ్ఞానము నీ కోసం..... కర్మ తెరలు నా కోసం
రెండు కలసిన - నిండు మోక్షము - మనకోసం ॥కర్మజీవి॥

2) కోప గుణము కలవాడా - జ్ఞాన చూపు లేనివాడా
యోగమార్గము - జ్ఞాన ఖడ్గము - స్వంతమే కాదా ॥కర్మజీవి॥

3) జ్ఞానమంతా పైపైనే - యోగమంతా నా పైనే
ఆత్మ సన్నిధి - ఒదిగినంతనె - మారిపోదువులె ॥కర్మజీవి॥

## చిత్రము : **గీత (1973)**

పాట : **పూచే పూలలోనా - వీచే గాలిలోనా**

చూచే ఆత్మలోనా - చేసే ఆత్మ నీవే
నీ జ్ఞానమే మ్రోగెలే - నీ యోగమే సాగెలే
ఓ గురూ........ ఓ ..........గురూ

1) నీ ఆశ్రమమే - శాంతికి నిలయము
నిను సేవించుటే - బ్రతుకే ధన్యము
నీవు మావాడవై - మేము నీవారమై
మమ్ము లాలించి - పాలించరా స్వామి ॥చూచే ఆత్మ॥

2) తల్లివి నీవే - తండ్రివి నీవే
ఎన్నడు తరుగని - పెన్నిధి నీవే
నిన్ను నమ్మినాము - మమ్ము దరిచేర్చవా
స్వామి నీ శిష్యులను - బ్రోవవా స్వామి ॥చూచే ఆత్మ॥

3) ఎన్నో జన్మల - పుణ్యము మాది
నిను సేవించుట - కబ్బెను మాకు
మేము నీ గానమే - మేము నీ ధ్యానమే
నీవు లేకున్న - ఈ లోకమే శూన్యము ॥చూచే ఆత్మ॥

4) వేడుకలోనా - వేదనలోనా
మరువము స్వామీ - నీ పదసేవా
నీవు మాదేవుడే - మేము మీ భక్తులె
మముకరుణించి - కాపాడవా స్వామి ॥చూచే ఆత్మ॥

చిత్రము : **బుల్లెమ్మ బుల్లోడు (1972)**

పాట **: కురిసింది వాన - నా గుండెలోనా**
తెలిసింది జ్ఞానం - నా స్మృతిలోన - నీ చూపులే చల్లనా
మధురం నీ జ్ఞానం - మధురం నీ యోగం

1) మహిలో ధర్మము - మనుపగనెంచి - మా ప్రభువైనావో
మమతలు తెలిసి - మనుషుల మలచి - మనుజుల బ్రోచేవో
వెలిసే నీలీలా..... తెలిసే దేవేలా........... ॥తెలిసింది॥

2) అండము పిండము - ఈ బ్రహ్మాండము - నిండెను నీ మహిమా
పావన నీ నామము - మరువక చేసెద - మదిలో నీ భజనా
కానవా దేవా - కరుణాల వాలా ॥తెలిసింది॥

3) సతతము నిన్ను - స్మరియింతుమయా - ఆత్మలో అను దినమూ
మా మనసున నిలిపి - మాయలు బాపీ - మము చేరదీసేవో
జగమే నీవంతా - శక్తివైనావు ॥తెలిసింది॥

4) కొండలలోనా - కోనలలోనా - ఉండెను నీ ఆత్మా
ఆత్మానంద - యోగము పొంద - మార్గము చూపవయా
సరియైన త్రోవ - చూపించరావా ॥తెలిసింది॥

చిత్రము : **ఆత్మ బలము (1964)**

పాట : **చిటపట చినుకులు**

గణగణ – గంటలు – మ్రోగుచుయుంటే
కోవెల సరసన – భక్తులుయుంటే
పండూ ఫలము చేతిలో పట్టి
మ్రొక్కుబడులకై పోవుచుయుంటే
చేయుచున్న ఆ పూజ – ఎంతో అర్థము ఉంటుందోయి

1) కొబ్బరికాయలు కొడుతూయుంటే
పూజలు మెండుగ చేయుచుయుంటే
కలి మాయలలో చేసే పూజే
శాశ్వితమనుకొని తలచుచుయుంటే
చేయుచున్న ఆ పూజ – ఎంతో అర్థము ఉంటుందోయి ॥గణగణ॥

2) హారతి పొగలు ఎగురుచుయుంటే
మింటిలో కలిసి పోవుచుయుంటే
నేనూ నీవలె అయిపోయెదనని
చేతితో శపథము చేయుచుయుంటే
చేయుచున్న ఆ పూజ ఎంతో అర్థము ఉంటుందోయి ॥గణగణ॥

చిత్రము : **సతీ అనసూయ (1971)**

పాట : **ఆలయమేలా అర్చనలేలా**

ఆలయమేలా – అర్చనలేలా – ఆరాధనలేలా
గురుదేవుని పదసన్నిధి మించినది వేరే కలదా
అదే మన పెన్నిధి కాదా – అదే పరమార్థము కాదా

1) ఏ కొండ కొమ్మలోనో – ఏ రాతి బొమ్మలోనో
దైవమ్ము దాగేనంచు తపియించనేల

ఆ దైవము తనలోయుంటే, అడుగడుగున తానేయుంటే
గుడులేల – యాత్రలేల ॥ఆలయమేలా॥

2) పైపైన కోర్కెల కోసం – భ్రమచెందు గ్రుడ్డిలోకం
హృదిలోన వెలిగే గురుని గమనించునా
ఆ దైవము తనలోయుంటే, అడుగడుగన తానెయుంటే
గుడులేల – యాత్రలేల ॥ఆలయమేలా॥

చిత్రము : **సువర్ణ సుందరి (1957)**

పాట : **పిలువకురా – అలుగకురా**

సాగుమురా.... ధైర్యముగా....... గురుదరి చేరగ ఓ జీవా...
పరమును చూడగ ఓ జీవా.....

1) మనసున చింత – విడువగ లేవా
గుణముల – త్రుంచగ – తలుపగ లేవా
కర్మల వేగమే – కాల్చగ లేవా
రయముతో – గురునీవేళ – ప్రార్థించగరారా ॥సాగుమురా॥

2) గురు పద సేవ – మరువక నీవు
మనసున – నిలిపి – పూజలు చేయ
నిను గురువేగమే – చేకొను లేరా
దయచూపి – నీకీవేల – బోధించును లేరా ॥సాగుమురా॥

3) పాపపుణ్యము – విడచినవాడు
శ్రీగురు – దరిచేరి – కొలచినవాడు
కనుగొను వేగమె – ఆత్మను వాడు
ధరణిలో – గురువీరీతి – బోధించేనులేరా ॥సాగుమురా॥

4) ప్రబోధ గురుని – చేరిన నీకు
జన్మలు – స్థిరముగ – పోవును లేరా

జ్ఞానము చేకొని – నడువుము నీవు
కరుణాతో – నిన్నీవేళ – కాపాడును లేరా ॥సాగుమురా॥

చిత్రము : **చిరంజీవులు (1956)**

పాట : **కనుపాప కరవైన కనులెందుకో**

| | | | | |
|---|---|---|---|---|
| | గురుబోధ | బరువైన | మనిషెందుకో | |
| | గురుకంటే | పరుడైన | బ్రతుకెందుకో | ॥గురుబోధ॥ |
| 1) | గురుబోధ | పరమాత్మ | తెలిపేనయా | |
| | గురుచేరి | శరణనుము | ఓ జీవుడా.... ఓజీవుడా | ॥గురుబోధ॥ |
| 2) | అధర్మంబు | నిండెను | నీలోనురా | |
| | ధర్మంబు | తెలిసి | నడువుమురా..నడువుమురా | ॥గురుబోధ॥ |
| 3) | గీతలోని | బోధలన్ని | తెలియుమురా | |
| | ఆ గీతలోని | వ్రాతగ | నడువుమురా..నడువుమురా | ॥గురుబోధ॥ |
| 4) | జ్ఞానూల | దూషించే | నీచులుగా | |
| | కర్మాలు | మోసేరు | మూర్ఖులుగా...మూర్ఖులుగా | ॥గురుబోధ॥ |
| 5) | గురుపూజ | చేయంగ | బాధపడుదురె | |
| | మూర్ఖులు | తెలియరు | గురుదేవుని....గురుదేవుని.. | ॥గురుబోధ॥ |
| 6) | కలికాల | మాయలో | పడిపోదురా | |
| | కనులైన | తెరవక | మసలుదురా...మసలుదురా | ॥గురుబోధ॥ |
| 7) | ప్రబోధ | గురుని | చేకొనరా | |
| | అసలైన | బోధలు | తెలియుమురా...తెలియుమురా | |

॥గురుబోధ॥

గమనిక :- ఈ సినిమా పాటలన్నీ ఇంటర్‌నెట్‌లో లభిస్తాయి.
ఆ పాటల లయను అనుసరించి మీరు పాడుకోవచ్చును.

ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ ద్వితీయోధ్యాయః - సాంఖ్యయోగః

శ్రీ భగవానువాచ :-

(2) శ్లో॥ 11 : అశోచ్యానన్వశోచస్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ
నానుశోచంతి పండితాః ॥ (ప్రకృతి, పరమాత్మ)

(2) శ్లో॥ 12 : న త్వేవాహం జాతు నాసం
న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః
సర్వే వయమతః పరమ్ ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 13 : దేహినోస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతరప్రాప్తిః
ధీరస్తత్ర న ముహ్యతి ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 14 : మాత్రాస్పర్శాస్తు కౌంతేయ !
శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోనిత్యాః
తాంస్తితిక్షస్వ భారత ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 15 : యం హి న వ్యథయంత్యేతే
పురుషం పురుషర్షభ ।
సమదుఃఖసుఖం ధీరం
సోమృతత్వాయ కల్పతే ॥ (జీవాత్మ)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

## శ్రీ మద్భగవద్గీత

ద్వితీయోధ్యాయము.

## సాంఖ్యయోగము

11\. శ్రీ భగవంతుడిట్లనియె :-

ఆ. శోక మంది తీవు శోకింపఁ దగనివా
రలకుఁ; బ్రజ్ఞ లెల్లఁ బలికి తీవు;
జీవరహితములకు జీవులకును భువి
బండితులు విషాదపడరు పార్థ !

12\. తే. నేను లేకుంటి నను టెన్నఁడేని లేదు
నీవు నట్టులె; యీధరానేత లట్లె;
ఇంక ముందును మన మందరెన్నఁటికిని
లేకపోవుదు మనుటయే లేదు సుమ్మి.

13\. తే. దేహి కెట్లు గల్గెడినొ యీదేహమందు
బాల్యమును యౌవనము జర వరుస; నట్లె
కలుగు దేహాంతరప్రాప్తి; కనుక, ధీరుఁ
డట్టి దానికై యెపుడు మోహమునఁబడఁడు.

14\. తే. పంచతన్మాత్రలను బుట్టి ప్రబలుచుండు
జగతి శీతోష్ణసుఖదుఃఖజాల మెల్ల;
వచ్చిపోయెడు నివి, యశాశ్వతము లగుట
వాని నొకయింత యోర్చుకోవలయుఁ బార్థ !

15\. తే. అవనిలో నెవ్వనికి వీని వ్యథ గలుగదొ
ఎవఁడు సుఖదుఃఖభేదంబులెంచుకొనఁడొ
వాఁడెయగు సమర్థుం డిలఁబాండవేయ!
మోక్షపదవికి నర్హత్వమును గడింప

(2) శ్లో॥ 16 : నాసతో విద్యతే భావో
నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోంతః
త్వనయోస్తత్త్వదర్శిభిః ॥ (ఆత్మ)

(2) శ్లో॥ 17 : అవినాశి తు తద్విద్ధి
యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య
న కశ్చిత్ కర్తుమర్హతి ॥ (పరమాత్మ)

(2) శ్లో॥ 18 : అంతవంత ఇమే దేహా
నిత్యస్యోక్తాః శరీరిణః ।
అనాశినోऽప్రమేయస్య
తస్మాద్యుధ్యస్వ భారత! ॥ (ఆత్మ, పరమాత్మ)

(2) శ్లో॥ 19 : య ఏనం వేత్తి హంతారం
యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో
నాయం హంతి న హన్యతే ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 20 : న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యః శాశ్వతోయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ (పరమాత్మ)

(2) శ్లో॥ 21 : వేదావినాశినం నిత్యం
య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ!
కం ఘాతయతి హంతి కమ్ ॥ (పరమాత్మ)

16. తే. సత్తు గనక జీవునకు నాశంబు లేదు;
ఉనికి లే దసత్త గుదేహమునకుఁ బార్థ!
నిశ్చయస్థితి నీరెంటి నిర్ణయంబు
తత్త్వవిదులైన వారికే ద్రష్ట మగును.

17. తే. ఎల్ల భువనంబులందు వ్యాపించియుండు
నాత్మతత్త్వంబు నాశనంబంద దెపుడు;
అవ్యయుండగు నవ్వానివ్యయ మొనర్పఁ
జాలఁడీభువి నెవఁడేని సవ్యసాచి !

18. తే. అప్రమేయు డనాశనుండఖిలనిత్యుఁ
డగు శరీరి వసించు దేహమున కెన్నఁ
డైన నాశంబు తప్పనిదండ్రు గాన
రణ మొనర్పుమీ యికను భారత వరేణ్య

19. తే. ఆత్మ నెవ్వడు వధియించు నదిగ దలచు
దాని నెవ్వఁడు వధ్యంబు గాను దలఁచు
నిరువురును జ్ఞానశూన్యు లంచెఱుఁగవలయు;
హత్య యొనరింపఁ డాత్మదాహతుఁడు గాఁడు.

20. ఆ. జన్మ మొందఁ డాత్మచావం డొకపు డైనఁ
బుట్టి మరల లేక పోవఁడెపుడు
అవ్యయుండు నిత్యుఁడజుఁడు పురాణుండు
హతశరీరఁ డయ్యుహతుఁడు గాఁడు.

21. తే. ఆత్మ నవినాశుఁడును నిత్యుఁడజుఁడు మరియు
నవ్యయుండని హర్షించునట్టిపురుషు
డెట్టు లవ్వాని హింసింపనెంచఁగలఁడు?
హింసఁ జేయించుటకు నైననెట్లు దలఁచు?

(2) శ్లో॥ 22 : వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి ॥
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 23 : నైనం ఛిందంతి శస్త్రాణి
నైనం దహతి పావకః ।
నచైనం క్లేదయంత్యాపో
న శోషయతి మారుతః ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 24 : అచ్ఛేద్యోయమదాహ్యోయమ్
అక్లేద్యోఅశోష్య ఏవచ ।
నిత్య సర్వగత స్థాణుః
అచలోయం సనాతనః ॥ (పరమాత్మ)

(2) శ్లో॥ 25 : అవ్యక్తోయమచింత్యోయమ్
అవికార్యోయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం
నానుశోచితుమర్హసి ॥ (ఆత్మ)

(2) శ్లో॥ 26 : అథచైనం నిత్యజాతం
నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో!
నైవం శోచితుమర్హసి ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 27 : జాతస్య హి ధ్రువోమృత్యుః
ధ్రువం జన్మ మృతస్యచ ।
తస్మాదపరిహార్యేర్థే
న త్వం శోచితుమర్హసి ॥ (జీవాత్మ)

22. ఆ. జీర్ణమైనయట్టి చేలము ల్విడఁదీసి
క్రొత్తవాని నరుఁడు గొనినయట్లె
దేహి జీర్ణమైన దేహంబులను వీడి
క్రొత్త దేహములనుగొనును బార్థ !

23. తే. ఆయుధంబులు ఛేదింపవాత్మ నెపుడు;
వహ్నివలన దహింపఁగావలనుపడదు;
జలము లైన్నైనఁ దడుపగాఁజాల వతనిఁ
బవనుచేతను శోషింపఁ బడఁ డతండు.

24. తే. దహన మందఁ డతండు, ఛేదనముఁగనఁడు,
తడుపఁబడఁ డెండిపోఁడు, నిత్యుఁడును, సర్వ
జగములందును వ్యాపింపఁజాలువాఁడు
స్థాణుఁ డచలుం డనాది యాతండు పార్థ !

25. తే. వ్యక్త మొనరించుటకు సాధ్యపడదు వానిఁ
జింతసేయ నసాధ్యం బొకింతయేని
నంట వతని వికారంబు లందువలన
వానికై యేల దుఃఖింపవలయుఁ బార్థ !

26. తే. అట్లు గాకుండ వాఁడు నిత్యంబుఁ బుట్టి
నిత్యమును జచ్చు నం చననేర్తు వేని
నావిధంబున నైన నీవతనికొఱకు
దుఃఖపడ నేల చెప్పుమా దురితదూర!

27. తే. జనన మొందు టెన్నఁటి కైనఁజచ్చుకొఱకె;
చచ్చు టెల్లను మఱిపునర్జన్మమునకె;
కనుక ననివార్య మైనసంగతి గుఱించి
నీవు శోకించుటిది యెట్టి నీతి చెపుమ.

(2) శ్లో॥ 28 : అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్త నిధనాన్యేవ
తత్ర కా పరిదేవనా ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 29 : ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్
ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 30 : దేహీ నిత్యమవధ్యోయం
దేహే సర్వస్య భారత ! ।
తస్మాత్ సర్వాణి భూతాని
న త్వం శోచితుమర్హసి ॥ (జీవాత్మ)

(2) శ్లో॥ 38 : సుఖదుఃఖే సమే కృత్వా
లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాపమవాప్స్యసి ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 39 : ఏషాతేఖిహితా సాంఖ్యే
బుద్ధిర్యోగే త్విమాం శృణు ।
బుద్ధ్యాయుక్తో యయా పార్థ!
కర్మబంధం ప్రహాస్యసి ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 40 : నేహాభిక్రమనాశోస్తి
ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్ ॥ (కర్మయోగము)

28. తే. వ్యక్తములు గావు భూతసంభవము లెల్ల;
వ్యక్తపడ వట్లె వాని యంత్యములు గూడ;
మధ్యములు మాత్ర మగపడు మహినిఁగాన,
భూతముల కీవు శోకంబు పొందనేల?

29. తే. కనెడి నాశ్చర్య మంది యొక్కండు వాని;
వినెడి నాశ్చర్య మొందుచు వేఱొకండు;
పలుకు మఱియొకం డాశ్చర్యమగ్నుఁ డగుచు;
వానికలరూపు నెఱుఁగఁ డెవ్వండు గాని.

30. ఆ. సర్వదేహములను సంక్రమించి వసించు
దేహి యెన్నఁటికి వధింపఁబడఁడు;
కనుక భూతజాలమునకయి యిటు నీవు
స్వాంతమందు దుఃఖపడుట తగదు.

38. తే. కష్ట సుఖములు మఱి లాభనష్టములును
జయ మపజయంబు లెల్లను సమము గాఁగఁ
దలఁచి యుద్ధం బొనర్పుము దాని వలనఁ
బాప మొంద వొకింతేనిఁబార్థ! నీవు.

39. తే. కల దిదే జ్ఞానపథము సాంఖ్యంబునందు;
దీని వచియించితిని నీకుదెలియుకొఱకు;
కర్మబంధంబు వదలింపఁ గలుగునట్టి
బుద్ధి యోగంబుఁ గను మింకఁబుణ్యచరిత!

40. తే. లే దభిక్రమనాశంబులేశమేని;
కల్గ దేదోష మిట్టి యోగంబువలన;
మనుజునకుఁ గర్మయోగ ధర్మం బొకింత
చాలు దాఁటింపఁ జేయ సంసారభయము.

(2) శ్లో॥ 41 : వ్యవసాయాత్మికా బుద్ధిః
ఏకేహ కురునందన! ।
బహుశాఖా హ్యనంతాశ్చ
బుద్ధయోవ్యవసాయినామ్ ॥ (ప్రకృతి)

(2) శ్లో॥ 42 : యామిమాం పుష్పితాం వాచం
ప్రవదంత్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ !
నాన్యదస్తీతి వాదినః ॥ (ప్రకృతి)

(2) శ్లో॥ 43 : కామాత్మానః స్వర్గపరా
జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం
భోగైశ్వర్యగతిం ప్రతి ॥ (ప్రకృతి)

(2) శ్లో॥ 44 : భోగైశ్వర్యప్రసక్తానాం
తయాపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః
సమాధౌ న విధీయతే ॥ (ప్రకృతి)

(2) శ్లో॥ 45 : త్రైగుణ్య విషయావేదా
నిస్త్రైగుణ్యో భవార్జున! ।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ (బ్రహ్మ,కర్మయోగములు)

(2) శ్లో॥ 46 : యావానర్థ ఉదపానే
సర్వతః సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు
బ్రాహ్మణస్య విజానతః ॥ (కర్మయోగము)

41. తే. జనులలో మోక్షమందే యాశయము నిల్పు
వారి దౌ బుద్ధి యొక్కటే పాండవేయ!
వేఱభిప్రాయములు గల్గు వారి కెల్ల
బుద్ధి శాఖోపశాఖలై పోవుచుండు.

42. ఆ. స్వర్గ తుల్యమైన సౌఖ్యంబు లేదంచు
వేదవిదుల కిట్లు విదిత మనుచు
జ్ఞానశూన్యు లగుచుఁ గమనీయపుష్పసం
తతుల సరణిఁ బల్కి తనరుజనులు.

43. తే. స్వర్గకామాత్ము లౌవారి భాషణములు
జన్మకర్మఫలాదు లొసంగునవియుఁ
బెక్కుక్రియలచే నతిశయింపించునవియు
నిహసుఖంబులు భోగంబు లిచ్చునవియు.

44. తే. ఇట్టి కోర్కులచే నపహృతమనస్కు
లైనవారలు భోగేచ్ఛలాశ్రయింత్రు;
వారిమనసున కెన్నండు పట్టువడదు
ఆత్మవిజ్ఞానదాయికంబైనబుద్ధి.

45. తే. వేదము లనంగఁ ద్రైగుణ్య విషయికములు;
వాని మూఁటిని వర్జింప వలయుఁ బార్థ !
ద్వంద్వములు వీడి నిత్య సత్త్వము ధరించి
క్షేమమును లాభమును నుపేక్షింపవలయు.

46. తే. జలసమృద్ధమైయుండు కాసారమందు
వలయునీరంబె యుపయోగ। పఱచునట్లు
సర్వవేదంబులందును జ్ఞానియైన
బ్రాహ్మణుఁడు గొనుఁ దనకుఁగావలసినంతె.

(2) శ్లో॥ 47 : కర్మణ్యేవాధికారస్తే
మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః
మా తే సంగోస్త్వకర్మణి ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 48 : యోగస్థః కురు కర్మాణి
సంగం త్యక్త్వా ధనంజయ! ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 49 : దూరేణ హ్యవరం కర్మ
బుద్ధియోగాద్ధనంజయ! ।
బుద్ధౌశరణమన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 50 : బుద్ధియుక్తో జహాతీహ
ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ
యోగః కర్మసు కౌశలమ్ ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 51 : కర్మజం బుద్ధియుక్తాహి
ఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబంధవినిర్ముక్తాః
పదం గచ్ఛంత్యనామయమ్ ॥ (కర్మయోగము)

(2) శ్లో॥ 52 : యదా తే మోహకలిలం
బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం
శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

47. ఆ. కర్మమందె నీకుఁ కల దధికారంబు;
ఫలమునందు నాశఁబడయవలదు;
కర్మఫలమునకును గాఁబోకు హేతువు;
కర్మలోపమునకుఁ గాకు మట్లె

48. ఆ. సవ్యసాచి ! నీవు సంగంబు వర్జించి
సిద్ధిఁ జూచినట్ల సిద్ధిఁ జూచి
యోగమందె నిలిచి యొనరింపు కర్మంబు;
లట్టి సమత యోగమండ్రు బుధులు.

49. తే. కామ్యకర్మంబు నీచంబు కామ్యరహిత
కర్మ మొనరించు బుద్ధియోగంబుకంటె;
ఫలముపైఁ గాంక్ష నీచులపాలుగాన
బుద్ధి యోగంబుచే నీవు సిద్ధి గనుము.

50. తే. బుద్ధియుక్తుండు విడుచు నీపుడమియందు
సుకృత దుష్కృతములను విశుద్ధ చరిత!
కనుకఁ జరియింపు బుద్ధియోగమున నెపుడుఁ
గర్మములయందు యోగంబు కౌశలంబు

51. ఆ. బుద్ధియుక్తుఁడైన పురుషుండు జ్ఞానియై
కర్మఫలములందుఁ గాంక్ష విడిచి
జన్మబంధములను సంపూర్ణముగ వీడి
శ్రేష్ఠమైన పదముఁ జేరుకొనును.

52. ఆ. నీదుబుద్ధి మోహనిర్ముక్త మెపు డౌనొ
యపుడె, నీవు వినినయర్థమునకు,
వినఁగవలయు నర్థవివరణమునకు వై
రాగ్య మొదవు సంగ రహిత మగుచు.

(2) శ్లో॥ 53 : శ్రుతివిప్రతిపన్నా తే
యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధిః
తదా యోగమవాప్స్యసి ॥ (బ్రహ్మయోగము)

**అర్జున ఉవాచ :-**

(2) శ్లో॥ 54 : స్థితప్రజ్ఞస్య కా భాషా?
సమాధిస్థస్య కేశవ! ।
స్థితధీః కిం ప్రభాషేత?
కిమాసీత? వ్రజేత కిమ్? ॥ (బ్రహ్మయోగము)

**శ్రీ భగవానువాచ :-**

(2) శ్లో॥ 55 : ప్రజహాతి యదా కామాన్
సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః
స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 56 : దుఃఖేష్వనుద్విగ్నమనాః
సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః
స్థితధీర్మునిరుచ్యతే ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 57 : యః సర్వత్రానభిస్నేహః
తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ (బ్రహ్మయోగము)

53. తే. వివిధ వేదార్థముల విని, వికలమైన
నీదుబుద్ధి సమాధిలో నిశ్చలముగ
నెపుడు నిలువంగఁబడునో నీవపుడె పార్థ !
బుద్ధి యోగంబు నిజముగాఁ బొందఁగలవు.

అర్జునుడిట్లనియె :-

54. ఆ. మౌనివంద్య ! భువి సమాధిస్థుఁ డౌస్థిత
ప్రజ్ఞునకుఁ జెలంగు భాష యెద్ధి?
అతఁడు పలుకు టెట్టు? లాసీనుఁడగు టెట్లు ?
వర్తనం బదెట్లు వనరుహాక్ష !

శ్రీ భగవంతుడిట్లనియె :-

55. ఆ. అనఘ! వినుము మనసునందలికామముల్
విడిచిపుచ్చి నరుడు విమలమైన
యాత్మలోనె తుష్ఠి యందినచో, స్థిత
ప్రజ్ఞుఁడనుచు నతఁడు పల్కబడును.

56. ఆ. దుఃఖములను వికృతి దోషంబుఁ జెందక
సుఖములందుఁ బరవశుండు గాక
రాగకోపభయ విరహితుఁడౌ నరు స్థిత
ప్రజ్ఞుఁడంద్రు భువినిఁ బ్రాజ్ఞు లెల్ల.

57. తే. ఎవఁడు సర్వత్ర స్నేహంబు నెదఁ దలఁపక
యంతకంతకుఁ గల్గు శుభాశుభముల
యెడల సంతోషదుఃఖంబులెల్ల విడుచు
నతనిప్రజ్ఞ ప్రతిష్ఠితంబగును బార్థ !

(2) శ్లో॥ 58 : యదా సంహరతే చాయం
కూర్మోంగానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 59 : విషయా వినివర్తంతే
నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోప్యస్య
పరం దృష్ట్వా నివర్తతే ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 60 : యతతో హ్యపి కౌంతేయ !
పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని
హరంతి ప్రసభం మనః ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 61 : తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ (బ్రహ్మయోగము)

(1) శ్లో॥ 62 : ధ్యాయతో విషయాన్ పుంసః
సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః
కామాత్ క్రోధోభిజాయతే ॥ (ప్రకృతి)

(2) శ్లో॥ 63 : క్రోధాద్భవతి సమ్మోహః
సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో
బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥ (ప్రకృతి)

58. ఆ. కూర్మ మెట్లు ముడుచుకొనుఁ గరచరణంబు
లట్లె విషయసుఖములంటకుండ
మనుజుఁ డింద్రియముల మరలింపవలయును;
అట్టివానిప్రజ్ఞ గట్టి దగును.

59. ఆ. అప్పుడింద్రియములకాహారమైనట్టి
విషయసుఖము లెల్ల వీడిపోవు;
విషయరాగ మొకటి వీడకుండిన నుండు
నదియుఁ బరముఁ గనిన వదలుఁ బార్థ!

60. ఆ. జ్ఞానియైనవాడు సర్వయత్నంబుల
సలుపుచుండుఁగాని సవ్యసాచి !
అప్పటికిని నింద్రి యంబు లాతనిమన
స్సట్టు నిట్టు లాగు నతిబలమున.

61. తే. అట్టి యింద్రియంబుల నెల్ల నణచిఁవైచి
యుక్తుఁడగువాఁడు నా యందె యుంచు మనసు;
ఇంద్రియంబులు వశ్యంబులెవని కగునో
యతనిప్రజ్ఞ ప్రతిష్ఠితంబగుచు నుండు.

62. తే. విషయములచింతచే నుద్భవించుచుండు
వానియందలిసంగంబు మానవునకు;
సంగబలమునఁ గామంబు సంభవించు;
దానివలన జనించుఁ గ్రోధంబు పార్థ !

63. తే. క్రోధముననె మోహంబు సేకూరుచుండు;
మోహమున స్మృతి భ్రమియింప మొదలుపెట్టు;
స్మృతి భ్రమించిన, బుద్ధి నశించు; దాని
వలన మనుజుండు తప్పక భ్రష్టుఁడగును.

(2) శ్లో॥ 64 : రాగద్వేషవియుక్తైస్తు
విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా
ప్రసాదమధిగచ్ఛతి ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 65 : ప్రసాదే సర్వదుఃఖానాం
హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు
బుద్ధిః పర్యవతిష్ఠతే ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 66 : నాస్తి బుద్ధిరయుక్తస్య
న చాయుక్తస్య భావనా ।
న చాభావయతః శాంతిః
అశాంతస్య కుతః సుఖమ్ ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 67 : ఇంద్రియాణాం హి చరతాం
యన్మనోను విధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం
వాయుర్నావమివాంభసి ॥ (ప్రకృతి)

(2) శ్లో॥ 68 : తస్మాద్యస్య మహాబాహో!
నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 69 : యా నిశా సర్వభూతానాం
తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః ॥ (బ్రహ్మయోగము, ప్రకృతి)

64. తే. రాగముల ద్వేషములను వర్జన మొనర్చి
విషయముల నింద్రియంబులు విడిచివైచి
వశ్యములు గాఁగ, స్వాధీనపడిన మనసు
గలుగు నెపుడు, ప్రసాదంబు గలుగు నపుడె.

65. తే. అలప్రసాదంబు లభియించినపుడె వాని
సర్వదుఃఖంబులకు హాని సంభవించు;
మనసు నైర్మల్యమును బొందు మఱియు బుద్ధి
చంచలింపక స్థిరపడు సత్వరముగ.

66. తే. యోగహీనున కిల బుద్ధి యుండఁబోదు;
భావనాశక్తి యతనికిఁబట్టువడదు;
భావనాశూన్యునకు శాంతిఁబడయరాదు;
శాంతి లేకున్న సుఖమెట్లు సంభవించు?

67 ఆ. ఏమనుష్యు చిత్తమింద్రియంబులవెంట
నంటి తిరుగుచుండు ననవరతము
అదియ వానిప్రజ్ఞ నాకర్షణము సేయు
గాలివలన నావ కదలినట్లు.

68. తే. కాన విషయంబులందు సంగంబు లేక
యెవఁడు సర్వవిధంబుల నింద్రియముల
నిగ్రహించునొ యట్టిమనీషివర్యుఁ
డగును శుద్ధాత్మదర్శకుండతులితముగ.

69. తే. ఎల్లజనుల కజాగ్రత్త యెందుఁ గలదొ
యందె జాగ్రత్త గలుగు సంయముల కెల్ల
సర్వభూతము ల్జాగ్రత్త సల్పునెడల
వా రజాగ్రత్త వహియించు వారగుదురు.

(2) శ్లో॥ 70 : ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్ కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతిమాప్నోతి న కామకామీ ॥ (బ్రహ్మయోగము)

(2) శ్లో॥ 71 : విహాయ కామాన్ యః సర్వాన్
పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః
స శాంతిమధిగచ్ఛతి ॥ (బ్రహ్మ, కర్మయోగములు)

(2) శ్లో॥ 72 : ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ !
నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాస్యామంతకాలేపి
బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ (బ్రహ్మ, కర్మయోగములు)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**సాంఖ్యయోగో నామ ద్వితీయోధ్యాయః**



70. తే. నిండి నిబిడీకృతంబుగా నిలుచుజలధి
నదులజల మెంత చేరినఁ గదలనట్టు
లెవండు కామముల్ సేరఁజలింపఁబడఁడొ
వాఁడె కను శాంతి; కామియౌ వాడు గనఁడు.

71. తే. సర్వకామము ల్విడనాడి జనుఁడు, వాని
స్పృహల సహితము మనసునఁ జేరనీక
మమత లేకుండ దురభిమానమును లేక
సంచరించినఁ, దప్పక శాంతినొందు.

72. ఆ. ఇదియ బ్రహ్మ మందహేతు వౌ స్థితి సుమీ
యిందుఁ దగిలి మోహ మందఁ డెవఁడు;
కలిగి దీని మరణ కాలంబునందైన
బ్రహ్మపదము నరుఁడు పడయుఁ బార్థ !

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**రెండవ అధ్యాయము, సాంఖ్యయోగము సమాప్తము.**



ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ తృతీయోధ్యాయః - కర్మయోగః

అర్జున ఉవాచ :-

(3) శ్లో॥ 1 : జ్యాయసీచేత్ కర్మణస్తే
మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం
నియోజయసి కేశవ! ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(3) శ్లో॥ 2 : వ్యామిశ్రేణేవ వాక్యేన
బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య
యేన శ్రేయోహమాప్నుయామ్ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

శ్రీ భగవానువాచ :-

(3) శ్లో॥ 3 : లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా
పురా ప్రోక్తా మయానఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(3) శ్లో॥ 4 : న కర్మణామనారంభాత్
నైష్కర్మ్యం పురుషోశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ
సిద్ధిం సమధిగచ్ఛతి ॥ (ప్రకృతి)

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

**శ్రీ మద్భగవద్గీతా**

తృతీయోధ్యాయము.

## కర్మయోగము

అర్జునుడిట్లనియె :-

01. తే. కర్మమునకంటె బుద్ధియోగంబె హెచ్చు
గాఁ దలంచితివేని నను గర్మమందె
యేల నియమించెదో కృష్ణ ! యెఱుఁగఁజాల,
ఘోరమైనను జేయక తీఱదనుచు.

02. తే. మిశ్రవాక్యంబులను బల్కి మిగుల నాదు
బుద్ధి భ్రమియింపఁ జేయకు పురుషవర్య !
దేని నొనరింప శ్రేయమో దాని నిశ్చ
యం బొనర్చి వచింపుమీ యంబుజాక్ష !

శ్రీ భగవంతుడిట్లనియె :-

03. తే. ద్వివిధనిష్ఠలు గల వంచుఁదెలిపియుంటి
ముందె, మనుజుల కీలోకమందుఁ బార్థ !
జ్ఞానవరు లాశ్రయింతురు జ్ఞానపథము
కర్మయోగుల కగు నిష్ఠ కర్మమందె.

04. తే. అవనిఁ గర్మ మారంభింపనంతమాత్రఁ
గలుగఁబోవదు నైష్కర్మ్యఫలము పార్థ!
చేయుచుండుకర్మల సన్న్యసించుటయును
జ్ఞానసిద్ధినిఁ గల్గింపఁ జాల దెపుడు

(3) శ్లో॥ 5 : న హి కశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతిజైర్గుణైః॥ (ప్రకృతి)

(3) శ్లో॥ 6 : కర్మేంద్రియాణి సంయమ్య
య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా
మిథ్యాచారః స ఉచ్యతే ॥ (బ్రహ్మయోగము, జీవాత్మ)

(3) శ్లో॥ 7 : యస్త్వింద్రియాణి మనసా
నియమ్యారభతేర్జున! ।
కర్మేంద్రియైః కర్మయోగమ్
అసక్తః స విశిష్యతే ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 8 : నియతం కురు కర్మ త్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాపి చ తే
న ప్రసిద్ధ్యేకర్మణః ॥ (బ్రహ్మయోగము)

(3) శ్లో॥ 9 : యజ్ఞార్థాత్ కర్మణోన్యత్ర
లోకోయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ !
ముక్తసంగః సమాచర ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 17 : యస్త్వాత్మరతిరేవ స్యాత్
ఆత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్టః
తస్య కార్యం న విద్యతే ॥ (బ్రహ్మయోగము)

05. తే. ఎట్టికర్మం బొనర్పక యెవ్వఁడేని
నొక్కక్షణమైన నూరకయుండలేఁడు;
ప్రకృతి జనితగుణంబుల బద్ధు లగుచు
జనులు కర్మంబుల వశులై సల్పుచుంద్రు.

06. తే. ఇంద్రియంబులపని నిగ్రహించి యెవ్వఁ
డింద్రియార్థంబులను స్మరియించుచుండు
నట్టి మనుజుని మూఢాత్ముఁడనుట గాక
యతనియాచార మది మిథ్య యంద్రు బుధులు.

07. తే. ఇంద్రియంబుల మనసుచే నెవ్వఁడణఁచి
కర్మఫలకాంక్ష వర్జించి కర్మయోగ
మాచరించెడిఁ గర్మేంద్రియములచేత
వానికంటెను శ్రేష్ఠుండు గానఁబడఁడు.

08. తే. నీవు సర్వదా యొనరింపు నియతకర్మ;
మాచరించుట మేలు త్యాజ్యమునకంటె;
దేహి సలుపంగఁజాలఁ డీదేహయాత్ర
కర్మమును విడనాడి సంక్రందనసుత !

09. తే. యజ్ఞకర్మంబుకంటె నన్యం బొనర్పఁ,
గర్మబంధంబు జగమునఁ గల్గుచుండుఁ
గాన, ఫలములయందు సంగంబు వదలి
యజ్ఞ సంబంధ మగుకర్మమాచరింపు.

17. తే. ఆత్మయందునె రమియింప నలవరించి
యాత్మతోడనె పరితృప్తిననుభవించి
యాత్మఁ గూడుచు సంతోషమందువాని
కేదియును గార్య మనునది లేదు భువిని.

(3) శ్లో॥ 18 : నైన తస్య కృతేనార్థో
నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు
కశ్చిదర్థవ్యపాశ్రయః ॥ (బ్రహ్మయోగము)

(3) శ్లో॥ 19 : తస్మాదసక్తః సతతం
కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ
పరమాప్నోతి పూరుషః ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 20 : కర్మణైవ హి సంసిద్ధిమ్
ఆస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి
సంపశ్యన్ కర్తుమర్హసి ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 21 : యద్యదాచరతి శ్రేష్ఠః
తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే
లోకస్తదనువర్తతే ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 22 : న మే పార్థాస్తి కర్తవ్యం
త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం
వర్త ఏవ చ కర్మణి ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 23 : యది హ్యహం న వర్తేయం
జాతు కర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే
మనుష్యాః పార్థ! సర్వశః ॥ (కర్మయోగము)

18. తే. వాని కేకృత్యమునను లాభంబు లేదు
సలుపనట్టికృత్యముల నష్టంబు లేదు;
ఆతఁడే ప్రయోజనముకై యాశ్రయింప
వలసినది సయితములేదు వసుధయందు.

19. తే. కావునం గర్మఫలములఁ గాంక్ష లేక
కర్మయోగి వై చేయుము కార్యములను;
సంగనిర్ముక్త కర్మంబు సల్పుపురుషుఁ
డాత్మసంప్రాప్తిఁ బొందువాఁడతులితముగ.

20. తే. కర్మయోగంబుచేఁ గదా కాంచగల్గి
రటులు జనకాదు లెల్ల రాత్మానుభవము;
జగతి జనులకు మార్గదర్శకుండ వగుట
కైనఁ గర్మంబు లొనరించుటవసరంబు.

21. తే. శ్రేష్ఠ లెయ్యది యాచరించెదరు భువిని
దానినే యాచరింతు రితరజనములు;
ఏ ప్రమాణంబుఁ జూపు వాఁడెల్లరకును
నయ్యదియె యనువర్తింతురఖిలజనులు.

22. తే. నాకుఁ గర్తవ్య మనునదే నాస్తి పార్థ!
యీ త్రిభువనంబులందు నేనింతవఱకుఁ
బడయనిది కర్మచయముచేఁ బడయవలసి
నదియు లే, దైనఁ గర్మంబు లాచరింతు.

23. తే. పార్థ! నే నెప్పుడైనను బ్రాలుమాలి
యూరకయె కర్మ మొనరింపకుందునేని
యన్ని విధముల నామార్గమనుసరించి
యట్లు యొనరింపరే యెల్ల యవని జనులు.

(3) శ్లో॥ 24 : ఉత్సీదేయురిమే లోకా
న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యామ్
ఉపహన్యామిమాః ప్రజాః ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 25 : సక్తాః కర్మణ్యవిద్వాంసో
యథా కుర్వంతి భారత! ।
కుర్యాద్విద్వాంస్తథాసక్తః
చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 26 : న బుద్ధిభేదం జనయేత్
అజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయేత్ సర్వకర్మాణి
విద్వాన్ యుక్తః సమాచరన్ ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 27 : ప్రకృతేః క్రియమాణాని
గుణైః కర్మాణి సర్వశః ।
అహంకారవిమూఢాత్మా
కర్తాహమితి మన్యతే ॥ (ప్రకృతి)

(3) శ్లో॥ 28 : తత్త్వవిత్తు మహాబాహో!
గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తంత
ఇతి మత్వాన సజ్జతే ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 29 : ప్రకృతేర్గుణసమ్మూఢాః
సజ్జంతే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మందాన్
కృత్స్నవిన్న విచాలయేత్ ॥ (ప్రకృతి)

24. తే. నేను గర్మంబు లొనరింప నేని జగతి
మనుజులెల్లను జెడుమార్గముననె చనరె ?
మరియుఁ గలుగదె వర్ణ సంకరము గానఁ
బ్రజల నెల్ల నేఁ జెఱిచిన వాఁడ గానె;

25. తే. సక్తచేతస్కుఁ డగుచుఁ దా సర్వగతుల
మూఢుఁ డేరీతిగాఁ గర్మముల నొనర్చు
జ్ఞానియును నట్లె మార్గదర్శకతకొఱకు
ఫలముగోరక కర్మముల్సలుపవలయు.

26. తే. జ్ఞాని గల్గింపఁగూడ దజ్ఞానులైన
కర్మసంగులబుద్ధికిఁ గలవరంబు;
పండితుఁడు కర్మతంత్రుఁడై ప్రజలచేతఁ
గర్మములను జేయుంచుట ధర్మము సుమి.

27. తే. ప్రకృతిజనిత గుణంబుల వలన వివిధ
గతుల నొనరింపఁబడు నెల్ల కార్యములకుఁ
గర్త తానే యటం చహంకార్యమగ్నుఁ
డౌ విమూఢాత్ముఁ డనుకొనునవనిఁ బార్థ !

28. తే. కర్మముల గుణముల విభాగం బెఱుంగు
తత్త్వవిదుఁ డైనవాఁడట్టి తలఁపు గొనక
త్రిగుణముల కార్యములె కర్మలగు నటంచుఁ
దలఁచుకొనుచుండు నాసక్తి వలను గనక.

29. తే. ప్రకృతి జనిత గుణంబుల బద్ధులైన
జనుల కాగుణకర్మములే సక్తి గొలుపు;
జ్ఞానులగువార లట్టియ జ్ఞానవరులఁ
జలన మొందింపగారాదు సవ్యసాచి !

(3) శ్లో॥ 30 : మయి సర్వాణి కర్మాణి
సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా
యుధ్యస్వ విగతజ్వరః ॥ (కర్మయోగము)

(3) శ్లో॥ 31 : యే మే మతమిదం నిత్యమ్
అనుతిష్ఠంతి మానవాః ।
శ్రద్ధావంతోనసూయంతో
ముచ్యంతే తేపి కర్మభిః ॥ (కర్మయోగము, జీవాత్మ)

(3) శ్లో॥ 32 : యే త్వేతదభ్యసూయంతో
నానుతిష్టంతి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్
విద్ధి నష్టానచేతసః ॥ (కర్మయోగము, జీవాత్మ)

(3) శ్లో॥ 33 : సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతేః జ్ఞానవానపి ।
ప్రకృతిం యాంతి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి ॥ (జీవాత్మ)

(3) శ్లో॥ 34 : ఇంద్రియస్యేంద్రియస్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్
తౌ హ్యస్య పరిపంథినౌ ॥ (బ్రహ్మయోగము)

(3) శ్లో॥ 35 : శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥ (జీవుడు, కర్మయోగము)

30. తే. సర్వకర్మముల్ నాయందె సన్న్యసించి
యాత్మచింతనమే చేతమందు నిలిపి
యాశలను మాని మమకారమసలె లేక
విగతతాపుఁడవై యుద్ధవిధి నొనర్పు.

31. తే. ఏ మనుష్యులు నాదైన యీమతంబు
శ్రద్ధ గల్గి యసూయావిరహితు లగుచు
ననుసరింపంగ నేరుతురనవరతము,
వారలనుఁ గర్మబంధముల్ వదలిచనును.

32. ఆ. ఎవఁడసూయ నొంది యీనామతం బను
ష్టింపఁ జనఁడొ వాఁడ చేతనుండు
సర్వవిధములైన జ్ఞానంబులకు మూఢుఁ
డగుచుఁ జెడినజనుఁ డటం చెఱుఁగుము.

33. తే. జ్ఞానియైనను దనపూర్వ సంస్కృతంబు
లకు సమానంబు లగుక్రియలనె చరించుఁ;
ప్రకృతితోడనె ప్రాణులు ప్రాఁకులాడు
నేమి యొనరించు నిగ్రహం బింద్రతనయ !

34. తే. జ్ఞానకర్మేంద్రియముల వాసనలయందు
రాగమును ద్వేషమును సుస్థిరతఁ జెలంగు;
వశము కారాదు మనుజుండు వాని కెపుడు;
పరమశత్రువు లవి యెట్టి నరున కైన.

35. తే. విగుణ మైనను శ్రేయంబు స్వీయధర్మ
మన్యమెంత స్వనుష్ఠితంబైనఁగాని;
మరణమే మేలు స్వీయధర్మంబునందుఁ
బరులధర్మంబు గలిగించు భయముకంటె.

ఆర్జున ఉవాచ :–

(3) శ్లో॥ 36 : అథ కేన ప్రయుక్తోఽయం
పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ !
బలాదివ నియోజితః ॥ (బ్రహ్మయోగము)

శ్రీ భగవానువాచ :–

(3) శ్లో॥ 37 : కామ ఏష క్రోధ ఏష
రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ (ప్రకృతి)

(3) శ్లో॥ 38 : ధూమేనావ్రియతే వహ్నిః
యథాదర్శోమలేన చ ।
యథోల్బేనావృతో గర్భః
తథా తేనేదమావృతమ్ ॥ (ప్రకృతి)

(3) శ్లో॥ 39 : ఆవృతం జ్ఞానమేతేన
జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌంతేయ !
దూష్పూరేణానలేన చ ॥ (ప్రకృతి)

(3) శ్లో॥ 40 : ఇంద్రియాణి మనో బుద్ధిః
అస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష
జ్ఞానమావృత్య దేహినమ్ ॥ (ప్రకృతి)

అర్జునుడిట్లనియె :-

36. తే. కూడదని యెంచి మనమునఁగోరకున్నఁ
బురుషుఁ డేల బలాత్కార పూర్వకముగ
దేనిచేఁ బ్రేరితుం డయితా నొనర్చుఁ
బాపముల నెల్ల, వచియింపు పరమపురుష!

శ్రీ భగవంతుడిట్లనియె :-

37. తే. అర్జునా! రాజసోద్భవమైనకామ
మనెడిగుణము దుష్పూరంబు గనుక నదియ
పాపహేతువై క్రోధరూపము వహించు;
శత్రువుగ దీని నెఱుఁగుమీ జ్ఞానమునకు.

38. ఆ. ధూమమందు వహ్ని, దుమ్ముచే నద్దంబు,
గర్భకలలమందు కన్నబిడ్డ,
గప్పఁబడినయట్లు కామంబుచేఁ గప్పఁ
బడును జ్ఞాన మెపుడుఁబార్థ! భువిని.

39. ఆ. జ్ఞానమునకు నిత్య శత్రుత్వము వహించి
తీర్పరానియట్టి తృష్ణగలిగి
కామ మనెడురూప నామంబులం బూని
కప్పుజ్ఞానమిది జగంబునందు.

40. తే. కలవు దీని కధిష్ఠానములు మనస్సు
బుద్ధియును నింద్రియములు విశుద్ధచరిత!
వీని నాధారముగఁ బూని జ్ఞానమెల్లఁ
గప్పి దేహికి మోహంబుఁ గలుగఁజేయు.

(3) శ్లో॥ 41 : తస్మాత్ త్వమింద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హేనం
జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ (బ్రహ్మయోగము)

(3) శ్లో॥ 42 : ఇంద్రియాణి పరాణ్యాహుః
ఇంద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిః
యో బుద్ధేః పరతస్తు సః ॥ (ప్రకృతి, ఆత్మ)

(3) శ్లో॥ 43 : ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా
సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో !
కామరూపం దురాసదమ్ ॥ (బ్రహ్మయోగము)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**కర్మయోగో నామ తృతీయోధ్యాయః**



41. తే. అందుచే నింద్రియంబుల నణఁచిపెట్టి
జ్ఞాన విజ్ఞానములను నాశన మొనర్చు
నదియుఁ, బాపంబుఁ జేయించునదియు నైన
కామమును ద్రుంపు మీవు సుత్రామతనయ!

42. తే. ఎంతు రివి శ్రేష్ఠము లటంచు నింద్రియముల;
వానికంటెను హెచ్చంద్రు మానసమును;
మనసుకంటెను బుద్ధిని ఘన మటంద్రు;
ఆత్మ దానికంటెను గూడ నధిక మంద్రు.

43. తే. కనుక బుద్ధికంటెను మేలుగాఁ జెలంగు
నాత్మయందె మనస్సు నైక్యం బొనర్చి
కామరూపమై యడఁప శక్యంబుగాని
శత్రువును గెల్వుమీ నీవు సవ్యసాచి!

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**మూడవ అధ్యాయము, కర్మయోగము సమాప్తము.**



ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ చతుర్థోధ్యాయః - జ్ఞానయోగః

శ్రీ భగవానువాచ :-

(4) శ్లో॥ 1 : ఇమం వివస్వతే యోగం
ప్రోక్తవానహమవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ
మనురిక్ష్వాకవే౽బ్రవీత్ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 2 : ఏవం పరంపరాప్రాప్తమ్
ఇమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా
యోగో నష్టః పరంతప! ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 3 : స ఏవాయం మయా తేద్య
యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోసి మే సఖా చేతి
రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

అర్జున ఉవాచ :-

(4) శ్లో॥ 4 : అపరం భవతో జన్మ
పరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం
త్వమాదౌ ప్రోక్తవానితి ॥ (జీవాత్మ, పరమాత్మ)

శ్రీ భగవానువాచ :-

(4) శ్లో॥ 5 : బహూని మే వ్యతీతాని
జన్మాని తవ చార్జున! ।
తాన్యహం వేద సర్వాణి
న త్వం వేత్థ పరంతప! ॥ (జీవాత్మ, పరమాత్మ)

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

## శ్రీమద్భగవద్గీత

చతుర్థాధ్యాయము.

## జ్ఞానయోగము

శ్రీ భగవంతుడిట్లనియె :-

01. తే. అవ్యయం బైనయోగమియ్యది కిరీటి!
భాస్కరున కేన యెఱుఁగంగఁబల్కియుంటి;
ఆతఁడది చెప్పె మనువునకతనివలన
నెఱుకపడియె నిక్ష్వాకుధాత్రీశునకును.

02. తే. ఇట్లిది పరంపరగ లభియించె గాన
దీని నల రాజఋషులెల్లఁ దెలిసికొనిరి;
చాలఁగాల మీరీతిగా జరుగ; నేడు
లోకమున యోగ మియ్యది లోప మొందె.

03. తే. మిగుల గుహ్యంబు నుత్తమంబగుటఁజేసి
యీపురాతనయోగంబు నెల్ల జనుల
కెఱుఁగఁజేయంగరానిది; యిపుడు నీకు
భక్తుఁడవు సఖుఁడవు గానఁ బల్కెద సుమి.

అర్జునుడిట్లనియె :-

04. ఆ. ఆదియందు జన్మ మాదిత్యునికిఁ గల్గె
నీదుజన్మ మిపుడు నీరజాక్ష!
ఎట్లు దీని నతని కెఱుఁగఁ జెప్పితి వీవు?
నమ్మునట్లు దెల్పు నళిననాభ !

శ్రీ భగవంతుడిట్లనియె :-

05. తే. నాకు బహుజన్మములు గల్గె నీకు నట్లె
యెన్నియో జన్మములు మాఱె నింద్రతనయ !
వాని నెల్ల నే నెఱుఁగుదు వరుసతోడ;
నీవు దెలియంగఁజాలవు నిశ్చయముగ.

(4) శ్లో॥ 6 : అజోపి సన్నవ్యయాత్మా
భూతానామీశ్వరోపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ
సంభవామ్యాత్మమాయయా ॥ (నిరాకారము, సాకారము)

(4) శ్లో॥ 7 : యదా యదా హి ధర్మస్య
గ్లానిర్భవతి భారత! ।
అభ్యుత్థానమధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్ ॥ (నిరాకారము, సాకారము)

(4) శ్లో॥ 8 : పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే ॥ (సాకారము)

(4) శ్లో॥ 9 : జన్మ కర్మ చ మే దివ్యమ్
ఏవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ
నైతి మామేతి సోర్జున! ॥ (సాకారము, నిరాకారము)

(4) శ్లో॥ 10 : వీతరాగభయక్రోధా
మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా
పూతా మద్భావమాగతాః ॥ (సాకారము)

(4) శ్లో॥ 11 : యే యథా మాం ప్రపద్యంతే
తాంస్తథైవ భజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తంతే
మనుష్యాః పార్థ! సర్వశః ॥ (సాకారము, నిరాకారము)

06. ఆ. అవ్యయుండ నగుచు నఖిలభూతములని
యామకుండ నగుచు నజుఁడ నగుచు
నాత్మమాయ జన్మమందుచుండును నాస్వ
భావ మైనప్రకృతి నావహించి.

07. తే. ఎప్పుడెపుడు ధర్మమునకు ముప్పు గలిగి
పృథివియందు నధర్మంబు వృద్ధిఁ జెందు,
అప్పుడప్పుడనే భూమి నవతరింతు
నన్నె సృజియించుకొని మహోన్నతచరిత్ర !

08. ఆ. సాధుజనుల నెల్ల సంరక్షణముసేయ
దుష్ట జనులఁబట్టి ద్రుంచివైవ,
సకలధర్మములను సంస్థాపన మొనర్ప
యుగయుగంబునందు నుద్భవింతు.

09. తే. కలవిధంబున నాదివ్య కర్మములను
జన్మములను గ్రహించెడు జనుఁడు మరణ
మందియును వేఱుజన్మంబు నందఁబోఁడు;
అట్టివాఁడు ననుం బొందు నవ్యయముగ

10. తే. భయము రాగంబుఁ గ్రోధంబుఁ బాఱఁద్రోలి
మన్మయాత్ము లై నన్నుఁ బ్రేమమునఁ గొలిచి
ఎందఱో జ్ఞానతపసుచేఁ చెందిరి ముని
నాదుసాధర్మ్యభావంబు నయచరిత్ర!

11. తే. ఎవరు నన్నే విధంబుగా నెంచి కొలుతు
రట్లె నాయనుగ్రహము వారందుచుంద్రు;
భక్త జనములు నా స్వభావంబు ననుభ
వింప నేర్తురు కోరిన విధంలనెల్ల.

(4) శ్లో॥ 12 : కాంక్షంతః కర్మణాం సిద్ధిం
యజంత ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే
సిద్ధిర్భవతి కర్మజా ॥ (ప్రకృతి)

(4) శ్లో॥ 13 : చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మవిభాగశః ।
తస్య కర్తారమపి మాం
విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ (పరమాత్మ)

(4) శ్లో॥ 14 : న మాం కర్మాణి లింపంతి
న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోభిజానాతి
కర్మభిర్న స బధ్యతే ॥ (కర్మయోగము, సాకారము)

(4) శ్లో॥ 15 : ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్ త్వం
పూర్వైః పూర్వతరం కృతమ్॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 16 : కిం కర్మ కిమకర్మేతి
కవయోప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి
యద్ జ్ఞాత్వా మోక్ష్యసేశుభాత్ ॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 17 : కర్మణోహ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః ॥ (ప్రకృతి, కర్మ, బ్రహ్మయోగములు)

12. ఆ. కర్మఫలములందుఁ గాంక్ష గల్గినవార
లమరపూజ సేతు రవని నెపుడు;
ఇహమునందుఁ గర్మమెంతయు శీఘ్రంబు
గాఁగ ఫలము నిచ్చుఁ గాదె? పార్థ !

13. ఆ. నాల్గువర్ణములును నా చేత సృష్టింపఁ
బడియెఁ గర్మగుణ విభాగరీతి;
అటులు వానికర్త నయ్యును మఱియుఁగా
కుండ నుందు నవ్యయుండ నగుచు.

14. తే. నన్నుఁ గర్మంబు లంటవు; నాకు వాని
ఫలములందును స్పృహలేదు పార్థ ! నా స్వ
భావ మిట్టి దటంచు నెవ్వం డెఱుంగుఁ
గర్మబంధంబు వానికిఁ గలుగ దెపుడు.

15. తే. దీని నెల్లను గలరీతిఁ దెలిసి పూర్వ
మోక్షకాములచేఁ గర్మములు నొనర్పఁ
బడియె; వార లొనర్చిన పగిది నీవు
నడచుకొను మర్జునా ! విని నాపలుకులు.

16. తే. కర్మమెయ్యదొ, యెయ్యది కర్మగాదొ,
పండితులుగూడఁ దెలియక భ్రమపడుదురు;
వదలు దేనిచే సంసార బంధమెల్ల
దానిఁ జెప్పెద నీకు సుత్రామతనయ !

17. ఆ. కర్మరూప మెఱుఁగఁ గావలె; నట్లె వి
కర్మరూప మెఱుఁగఁ గా వలయును;
మరి యకర్మరూప మరయుటయును నవ
శ్యంబు కర్మగతుల నరయుకొఱకు.

(4) శ్లో॥ 18 : కర్మణ్యకర్మ యః పశ్యేత్
అకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు
స యుక్తః కృత్స్నకర్మకృత్॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 19 : యస్య సర్వే సమారంభాః
కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం
తమాహుః పండితం బుధాః ॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 20 : త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోపి నైవ
కించిత్ కరోతి సః ॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 21 : నిరాశీర్యతచిత్తాత్మా
త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 22 : యదృచ్ఛాలాభసంతుష్టో
ద్వంద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధా వసిద్ధౌ చ
కృత్వాపి న నిబధ్యతే ॥ (కర్మయోగము)

(4) శ్లో॥ 23 : గతసంగస్య ముక్తస్య
జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయతే ॥ (కర్మయోగము)

18. తే. కర్మముల నిగ్రహించుట కర్మమనుచుఁ
గర్మములయం దకర్మంబు గల దటంచు
నెఱుఁగు మనుజుం డొనర్చినట్టెల్లకర్మ
ములను; వాఁడె జ్ఞాని యటంచుమునులమతము.

19. ఆ. ఎవఁడొనర్చుకర్మమెంతయుఁ గామసం
కల్పవర్జితంబొ, జ్ఞానవహ్నిఁ
గాల్పఁబడినకర్మగలవాఁడ దెవ్వండొ,
వాఁడె పండితుఁడని పలుకఁబడును.

20. తే. కర్మఫలములయెడల సంగంబు విడిచి
నిత్యతృప్తుఁడవై యాశ నిగ్రహించి
యఖిలకర్మంబులను సదా యాచరించు
వాఁడ వైతేనిఁ జేయనివాఁడ వగుదు.

21. ఆ. ఆశ విడిచి నియతమైనట్టి మనసుతో
మహిని దేనియందు మమత లేక
సల్పవలయు దేహ సంబంధముగఁ గర్మ;
మట్లు నేయఁ, గల్గ దఘము పార్థ!

22. తే. దొరకినట్టి లాభంబుతోఁ దుష్టిఁ జెంది
ద్వంద్వములను వర్జించి మత్సరము మాని
సిద్ధ్యసిద్ధ్యంబులను సమచింతఁ జూచి
కర్మలొనరింప బంధము । ల్గలుగఁబోవు.

23. తే. సంగశూన్యుండు ఫలవిసర్జనవరుండు
వీతచాంచల్యుఁడగు జ్ఞానచేతనుండు
నాచరితయజ్ఞ కర్ముఁడౌ నతనిపూర్వ
కర్మములును నిశ్శేషంబుగా నశించు.

(4) శ్లో॥ 33 : శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్
జ్ఞానయజ్ఞః పరంతప! ।
సర్వం కర్మాఖిలం పార్థ!
జ్ఞానే పరిసమాప్యతే ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 34 : తద్విద్ధి ప్రణిపాతేన
పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం
జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 35 : యద్ జ్ఞాత్వా న పునర్మోహమ్
ఏవం యాస్యసి పాండవ! ।
యేన భూతాన్యశేషేణ
ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥ (బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 36 : అపిచేదసి పాపేభ్యః
సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ
వృజినం సంతరిష్యసి ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 37 : యథైధాంసి సమిద్ధోగ్నిః
భస్మసాత్కురుతేర్జున! ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి
భస్మసాత్కురుతే తథా ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 38 : న హి జ్ఞానేన సదృశం
పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః
కాలేనాత్మని విందతి ॥ (కర్మయోగము)

33. తే. ద్రవ్యయజ్ఞంబుకంటె నుత్తమమటంచ్రు
జ్ఞానరూప మౌయజ్ఞంబు సవ్యసాచి !
యఖిలకర్మంబులను జ్ఞానమందె చేరి
పరిసమాప్తంబు లగునని యెఱుగవలయు.

34. తే. తత్వవేత్తలౌ విజ్ఞానధనులయెడల
వినయ వినమితసాష్టాంగ విధుల సల్పి
సేవ లొనరించి ప్రశ్నలఁజేయ, వారు
జ్ఞానమార్గోపదేశంబు సలుపఁగలరు.

35. తే. ఎట్టి జ్ఞానంబు గల్గిన నిట్టి మోహ
ముద్భవింపదో యట్టిభావోద్భవమున
నఖిలభూతజాలంబులనాత్మయందె
కందు, నావల వాని నాయందఁ గనెదు.

36 ఆ. అఖిలపాపజన్ములందును నీ వెంత
యధమపాపయుతుఁడవైనఁగాని
కలుషజలధి యెల్ల జ్ఞానప్లవంబుచే
దాఁటఁగలవు నీవు ధన్యచరిత!

37. తే. అగ్నియఁ దెన్నికట్టియలైనఁగాని
భస్మమై నాశ మొందెడు పగిదిఁ బార్థ!
జ్ఞాన మనునగ్నిచే సర్వ కర్మచయము
భస్మమొనరింపఁబడుచుండు విస్మయముగ.

38. తే. జ్ఞానమున కీజగంబున సాటిలేదు;
అంతకంటెఁ బవిత్ర మైనదియు లేదు;
కర్మయోగ సంసిద్ధుండు గాంచఁగలఁడు
క్రమముగాఁ దనంతటఁ దానె జ్ఞానసిద్ధి.

(4) శ్లో॥ 39 : శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
తత్పరః సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరామ్ శాంతిమ్
అచిరేణాధి గచ్ఛతి ॥ (బ్రహ్మయోగము)

(4) శ్లో॥ 40 : అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ
సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోస్తి న పరో
న సుఖం సంశయాత్మనః ॥ (జీవాత్మ)

(4) శ్లో॥ 41 : యోగసన్న్యస్తకర్మాణం
జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవంతం న కర్మాణి
నిబధ్నంతి ధనంజయ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(4) శ్లో॥ 42 : తస్మాదజ్ఞానసంభూతం
హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమ్
ఆతిష్ఠోత్తిష్ఠ భారత ! ॥ (కర్మయోగము)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**జ్ఞానయోగోనామ చతుర్థోధ్యాయః**



39. ఆ. ఇంద్రియముల నిగ్రహించి శ్రద్ధ వహించు
తత్పరులకు జ్ఞానధనము గలుగు;
జ్ఞాన మొంద, నచిరకాలంబుననె పొందు
పరమమైన శాంతిపథము పార్థ!

40. ఆ. సంశయాత్ముఁ డగుచు శ్రద్ధ వహింపక
జ్ఞానశూన్యుడైన జనుఁడు చెడును;
సంశయాత్ముఁడైన సంభవింపదు సుఖం
ఇహపరంబులందు నెందు నైన.

41. తే. యోగపద్ధతిఁ గర్మంబులుడుగువాని
జ్ఞానవిచ్ఛిన్న సంశయుండైనవాని
నిశ్చలముగ మనస్సును నిల్పువాని
నంటఁజాలవు కర్మంబు లవనిఁ బార్థ!

42. తే. కనుక, నజ్ఞానవశమునఁ గలిగి హృదయ
మందు నెలకొన్న నీసంశయమును జ్ఞాన
ఖడ్గమునఁ ద్రెంచి కర్మయోగం బొనర్పు
ధైర్యము వహించి లెమ్ము సుత్రామతనయ!

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**నాల్గవ అధ్యాయము జ్ఞానయోగము సమాప్తము.**



ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ పంచమోధ్యాయః - కర్మసన్న్యాసయోగః

అర్జున ఉవాచ :-

(5) శ్లో॥ 1 : సన్న్యాసం కర్మణాం కృష్ణ !
పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం
తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

శ్రీ భగవానువాచ :-

(5) శ్లో॥ 2 : సన్న్యాసః కర్మయోగశ్చ
నిఃశ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్
కర్మయోగో విశిష్యతే ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(5) శ్లో॥ 3 : జ్ఞేయః స నిత్యసన్న్యాసీ
యో న ద్వేష్టి న కాంక్షతి ।
నిర్ద్వంద్వో హి మహాబాహో !
సుఖం బంధాత్ ప్రముచ్యతే । (కర్మయోగము)

(5) శ్లో॥ 4 : సాంఖ్యయోగౌ పృథగ్బాలాః
ప్రవదంతి న పండితాః ।
ఏకమప్యాస్థితః సమ్యక్
ఉభయోర్విందతే ఫలమ్ ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(5) శ్లో॥ 5 : యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం
తద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాంఖ్యం చ యోగం చ
యః పశ్యతి స పశ్యతి॥ (కర్మ, బ్రహ్మయోగములు)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మద్భగవద్గీత

పంచమాధ్యాయము.

## కర్మసన్న్యాస యోగము

అర్జునుఁ డిట్లనియె :-

01. తే. కర్మసన్న్యాసము వచించి కమలనాభ !
కర్మ మొనరింపవలయు యోగమున కంటి;
రెంటియందును నా కెద్ది శ్రేష్ఠమగునొ
నిశ్చయముజేసి తెలుపుమీ నీ మతమును.

భగవంతుఁ డిట్లనియె :-

02. ఆ. కర్మయోగపథముఁ గర్మసన్న్యాసంబు
శ్రేయమే యొసంగు; రెంటియందు
జ్ఞానయోగి సేయు సన్న్యాసమునకంటెఁ
గర్మపథము మిగుల ఘనము పార్థ !

03. తే. ఎవ్వనికి లేవో ద్వేషంబులీప్సితంబు
లాతఁడే నిత్యసన్న్యాసియగును బార్థ !
ద్వంద్వములఁ ద్యాజ్య మొనరించువాఁడు సౌఖ్య
వంతుఁడగు; బంధనములచే బాధపడఁడు.

04. తే. కర్మయోగంబు జ్ఞానయోగంబు వేఱు
వేఱటంద్రు బాలకులు; వివేకు లనరు.
రెంటియందును జక్కని రీతి దేని
నాచరించిన ఫలసిద్ధి యగును బార్థ!

05. తే. జ్ఞానయోగంబుచేఁ గల్గుస్థాన మేదొ
కర్మయోగంబునందదే కల్గుచుండు;
జ్ఞానకర్మయోగముల సమానములుగఁ
దెలిసికొనువాఁడె చక్కఁగాఁ దెలియువాఁడు.

(5) శ్లో॥ 6 : సన్న్యాసస్తు మహాబాహో !
దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ
నచిరేణాధిగచ్ఛతి ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(5) శ్లో॥ 7 : యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మ భూతాత్మా
కుర్వన్నపి న లిప్యతే ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 8 : నైవ కించిత్ కరోమీతి
యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్
అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ॥ (కర్మయోగము)

(5) శ్లో॥ 9 : ప్రలపన్ విసృజన్ గృహ్ణన్
ఉన్మిషన్ నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు
వర్తంత ఇతి ధారయన్ ॥ (కర్మయోగము)

(5) శ్లో॥ 10 : బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సంగం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన
పద్మపత్రమివాంభసా ॥ (కర్మయోగము)

(5) శ్లో॥ 11 : కాయేన మనసా బుద్ధ్యా
కేవలైరింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వంతి
సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥ (కర్మయోగము)

06. తే. కర్మయోగసహాయంబుఁ గనక నరుఁడు
జ్ఞానియై సన్న్యసించుట కష్టతరము;
కర్మయోగంబు బ్రహ్మముం గనఁగఁ జేయు
మననశీలుర కతిశీఘ్రమున ధరిత్రి.

07. తే. అర్జునా! యోగి శుద్ధాత్ముఁడగుచు నింద్రి
యముల మానసమును నిగ్రహం బొనర్చి
యఖిల భూతాత్మలను దనయాత్మ గాఁగఁ
దలఁచి చేసెడికర్మముల్దగుల వతని.

08. తే. కర్త యేకార్యమునకును గా నటంచుఁ
దత్త్వవిదుఁ డైనయోగి దాఁదలఁచుచుండుఁ
గనుచు వినుచుఁ దాకుచును మూర్కొనుచుఁ దినుచుఁ
జనుచు నిద్రసేయుచును శ్వాసము విడుచుచు.

09. తే. కొనుచుఁ బల్కుచు వీడుచుఁ గనులఁ దెఱచు
చును గనుంగవ మఱి మూయుచును జెలంగి
యింద్రియంబులు తమతమ యిష్ట విషయ
ములఁ జరించుచుండు నటంచుఁ దలఁచు మదిని.

10. తే. బ్రహ్మమునకుఁ గర్మము సమర్పణముఁ జేసి
సంగ మనునది వర్జించి సలుపునాతఁ
డఖిలపాపచయంబుచే నంటఁబడఁడు
తామరాకు నీరంబునఁ దగులనట్లు.

11. ఆ. కర్మయోగి చేయుఁ గాయంబునను మఱి
చేతమునను బుద్ధిచేత నింద్రి
యములచేత సంగమావంతయును లేక
యాత్మశుద్ధి యాశయముగఁ గలిగి.

(5) శ్లో॥ 12 : యుక్తః కర్మఫలం త్యక్త్వా
శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ
ఫలే సక్తో నిబధ్యతే ॥ (కర్మయోగము)

(5) శ్లో॥ 13 : సర్వకర్మాణి మనసా
సన్న్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ
నైవ కుర్వన్ న కారయన్ ॥ (కర్మయోగము)

(5) శ్లో॥ 14 : న కర్తృత్వం న కర్మాణి
లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం
స్వభావస్తు ప్రవర్తతే ॥ (ప్రకృతి)

(5) శ్లో॥ 15 : నాదత్తే కస్యచిత్పాపం
న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం
తేన ముహ్యంతి జంతవ ః ॥ (ప్రకృతి)

(5) శ్లో॥ 16 : జ్ఞానేన తు తదజ్ఞానం
యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవత్ జ్ఞానం
ప్రకాశయతి తత్పరమ్ ॥ (ఆత్మజ్ఞానము)

(5) శ్లో॥ 17 : తద్బుద్ధయస్తదాత్మానః
తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం
జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ (బ్రహ్మయోగము)

12. ఆ. కర్మఫలములందుఁ గాంక్ష మానినయోగి
శాంతిఁ జెందు నిష్ఠ సలువుకొనుచు;
యోగి గానివాఁడు రాగంబులను మాన
లేక బంధములనె చిక్కుచుండు.

13. తే. మనసుచే సన్న్యసించి కర్మముల, వానిఁ
తన నవద్వారపుర దేహమునకు విడిచి
కార్యకర్త దాఁ గాక యకర్త గాక
యోగి సుఖముగ నివసించుచుండుఁ బార్థ!

14. ఆ. కర్మములను గాని కర్తృత్వమును గాని
కర్మఫలములందుఁ గాంక్ష గాని
యాత్మ గలుగఁ జేయఁడవని నెన్నండును
ప్రకృతివాసనలనె పరఁగు నవ్వి.

15. తే. ఎవనిపాపంబు నైనను నెవనిపుణ్య
మైనఁ దొలఁగింపఁ జాలఁ డీయాత్మ పార్థ!
కప్పఁ బడియుండు జ్ఞాన మజ్ఞానమందు;
దానిచే భ్రమియింతురు ధరణిజనులు.

16. తే. జ్ఞానమున నెట్టి జనుల యజ్ఞానమెల్ల
నాశనము సేయఁబడు; నట్టి నరులకుఁ గల
జ్ఞాన మాదిత్యురీతిఁ బ్రకాశమాన
మగుచు వారలయంధత్వమవలఁ ద్రోయు.

17. ఆ. ఆత్మయందు శుద్ధమౌ మనోబుద్ధిని
ష్ఠలు నెలంగ నిరతి సలుపువాఁడు
కల్మషముల వీడి జ్ఞానంబుచేఁ బొందు
జన్మరహితమైన సత్పథంబు.

(5) శ్లో॥ 18 : విద్యావినయసంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే
చ పండితాః సమదర్శినః ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 19 : ఇహైవ తైర్జితః సర్గో
యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మాద్ బ్రహ్మణి తే స్థితాః (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 20 : న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య
నోద్విజేత్ ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధిరసమ్మూఢో
బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 21 : బాహ్యస్పర్శేష్వసక్తాత్మా
విందత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా
సుఖమక్షయమశ్నుతే ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 22 : యే హి సంస్పర్శజా భోగా
దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ
న తేషు రమతే బుధః ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 23 : శక్నోతీహైవ యః సోఢుం
ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం
స యుక్తః స సుఖీ నరః ॥ (బ్రహ్మయోగము)

18. తే. విద్యయును వినయముఁ గల్గు విప్రులందు
గోవులందు నేనుఁగులందుఁ గుక్కలందు
గుక్కలను దినుచండాల కోటియందుఁ
బండితులదృష్టి చను సమభావముననె.

19. తే. మనసు నిల్చు నెవ్వనికి సమత్వమందు
నాతఁ డిహమందె సంసార ణాబ్ధి దాఁటు;
పాపములు లేమి, మతి సమత్వంబుకలిమి
యాత్మగుణములు కాన, వాఁడాత్మఁజెందు.

20. ఆ. బ్రహ్మవిదుఁడు బుద్ధి బ్రహ్మంబుననె నిల్పు;
మౌఢ్యగుణములనెల్ల మానివైచు;
సంతసింపఁడెంత సంప్రీతి గలిగినఁ
జింతఁ జెందఁ డెంతవంత యైన.

21. తే. బాహ్యశబ్దాదులందు సంబంధపడక
యంతరాత్మనె సుఖములనందు నెవ్వఁ
డతనినే బ్రహ్మయోగయుక్తాత్ముఁ డంద్రు;
అతని కగు నాశరహిత మైనట్టి సుఖము.

22. తే. స్పర్శ నాదిసుఖంబుల జన్యము లగు
భోగములు దుఃఖహేతువుల్పుణ్యచరిత;
వచ్చుచును బోవుచుండు; నవ్వాని బుధులు
సరకుసేయరు మతి సంతసమునఁ గనరు.

23. తే. కాయ మియ్యది విడుదల గాకమునుపె
ద్వేషరాగంబులం గల్గు వేగ మెల్ల
మాన్పి శాంతంబు దాల్చు సమర్థుఁ డెవఁడొ
వాఁడెసుమి యోగయుక్తుండు వాఁడె సుఖుఁడు.

(5) శ్లో॥ 24 : యోంతఃసుఖోంతరారామః
తథాంతర్జ్యోతిరేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం
బ్రహ్మభూతోధిగచ్ఛతి ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 25 : లభంతే బ్రహ్మనిర్వాణమ్
ఋషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః
సర్వభూతహితే రతాః ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 26 : కామక్రోధవియుక్తానాం
యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం
వర్తతే విదితాత్మనామ్ ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 27 : స్పర్శాన్ కృతత్వా బహిర్బాహ్యాన్
చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యంతరచారిణౌ ॥ (బ్రహ్మయోగము)

24. ఆ. ఆత్మయందె సుఖము నాత్మయందే క్రీడ
యాత్మయందె జ్ఞానమలవరించు
నట్టివాఁడె యోగియతఁడె జ్ఞానస్వరూ
పమున నాత్మ ననుభవం బొనర్చు.

25. ఆ. సర్వభూతహితము సల్పుచు, ద్వంద్వంబు
లను నశింపఁ జేసి మనసు నిల్ప
నేర్చుజ్ఞానవరులు నిర్ధూతకల్మషు
లగుచు నాత్మసుఖము ననుభవింత్రు.

26. తే. కామమును గ్రోధమును వీడఁగల్గువారు,
యతులు, నిగ్రహచేతస్కులైనవారు,
మనసు స్వాధీనపడియుండు మౌనిజనులు,
మోదమున నుంద్రు సర్వదా మోక్షమందె.

27. తే. స్పర్శశబ్దాది బాహ్య విషయసుఖముల
మాని భ్రూమధ్యమున దృష్టి నూనఁజేసి
ప్రాణమును నపానము సమత్వంబుఁ బొంది
నాసికలయందు సంచరణం బొనర్చ.

(5) శ్లో॥ 28 : యతేంద్రియమనోబుద్ధిః
మునిర్మోక్షపరాయణ ః ।
విగతేచ్ఛాభయక్రోధో
యః సదా ముక్త ఏవ సః ॥ (బ్రహ్మయోగము)

(5) శ్లో॥ 29 : భోక్తారం యజ్ఞతపసాం
సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥ (ఆత్మ)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**కర్మసన్న్యాసయోగోనామ**
**పంచమోధ్యాయః**



28. తే. యతములై నట్టి బుద్ధీంద్రియములు మనసుఁ
గలిగి రాగభయద్వేషములను వదలి
మోక్షమే పరమాశయముగఁ దలంచు
ముని లనుభవించెదరు సదా ముక్తదశను.

29. తే. యజ్ఞ తపముల నాహార మాచరించి
సర్వలోకంబులకు మహేశ్వరుఁడ నగుచు
నఖిలభూతకోటికి హితంబాత్మఁ దలఁచు
న న్నెఱుంగుటచే శాంతి నరుఁడు చెందు.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**ఐదవ అధ్యాయము, కర్మసన్న్యాసయోగము సమాప్తము.**



ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ షష్ఠోధ్యాయః - ఆత్మసంయమయోగః

శ్రీ భగవానువాచ :-

(6) శ్లో॥ 1 : అనాశ్రితః కర్మఫలం
కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ
న నిరగ్నిర్న చాక్రియః ॥ (కర్మయోగము)

(6) శ్లో॥ 2 : యం సన్న్యాసమితి ప్రాహుః
యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసన్న్యస్త సంకల్పో
యోగీ భవతి కశ్చన ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(6) శ్లో॥ 3 : ఆరురుక్షోర్మునేర్యోగం
కర్మ కారణముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ
శమః కారణముచ్యతే ॥ (కర్మ, బ్రహ్మయోగములు)

(6) శ్లో॥ 4 : యదా హి చేంద్రియార్థేషు
న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్పసన్న్యాసీ
యోగారూఢస్తదోచ్యతే ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 5 : ఉద్ధరేదాత్మనాత్మానం
నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధుః
ఆత్మైవ రిపురాత్మనః ॥ (పరమాత్మ,ఆత్మ,జీవాత్మ)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

## శ్రీ మద్భగవద్గీత

షష్ఠాధ్యాయము.

## ఆత్మ సంయమ యోగము

శ్రీ భగవంతుడిట్లనియె :-

01. తే. కర్మఫల మాశ్రయింపక కార్యములను
జేయవలసినవని యెంచిచేయు నెవఁడు;
వాఁడె నిజ మైన సన్న్యాసి; వాఁడె యోగి;
అగ్నులను గ్రియలను మానునతఁడు గాఁడు.

02. తే. దేని సన్న్యాస మందురు జ్ఞానులెల్ల
రదియు కర్మయోగ మటంచు మది నెఱుఁగుము;
మహిని మనుజుండు సంకల్పరహితుఁ డైనఁ
గాని, లభ్యంబు గాదు యోగం బతనికి.

03. తే. ఆత్మదర్శనమును గోరునట్టి మునికి
సహజముగఁ గర్మయోగంబె సాధనంబు;
యోగ మందినపిమ్మట యుక్తతముఁడు
శమము వహియింప నగు మోక్షసాధనముగ.

04. తే. ఎప్పుడగు సంగవర్జితం బింద్రియార్థ
విషయములయందుఁ దత్కర్మ విధులయందు,
నపుడె సర్వసంకల్ప సన్న్యాసి యగుచు
నరుఁడు యోగ మందినవాఁడ నంగఁ బరఁగు.

05. ఆ. మనసుచేత నాత్మకెనయు నౌన్నత్యంబు;
అధమగతికిఁ గూడనదియె పంపు;
కనుక నాత్మయెడల మనసు చరించెడు
మిత్ర మగుచు మఱియు శత్రు వగుచు.

(6) శ్లో॥ 6 : బంధురాత్మాత్మనస్తస్య
యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే
వర్తేతాత్మైవ శత్రువత్ ॥ (పరమాత్మ,ఆత్మ,జీవాత్మ)

(6) శ్లో॥ 7 : జితాత్మనః ప్రశాంతస్య
పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు
తథా మానావమానయోః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 8 : జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా
కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మకాంచనః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 9 : సుహృన్మిత్రార్యుదాసీన
మధ్యస్థద్వేష్య బంధుషు ।
సాధుష్వపి చ పాపేషు
సమబుద్ధి ర్విశిష్యతే ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 10 : యోగీ యుంజీత సతతమ్
ఆత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా
నిరాశీరపరిగ్రహః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 11 : శుచౌ దేశే ప్రతిష్ఠాప్య
స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం
చేలాజినకుశోత్తరమ్ ॥ (బ్రహ్మయోగము)

06. ఆ. ఎవఁడు మనసు నిగ్రహింపఁగల్గునొ వాని
యాత్మ కదియ మిత్రమగుచుఁ జెలఁగు;
అటులు మనసు నిగ్రహము సేయఁ జాలని
యతనియాత్మ కదియయగు విరోధి.

07. తే. జగతి శీతోష్ణ సుఖదుఃఖ జాలమందు
మఱియు మానంబునం దవమానమందు
మనసునం దెప్డుఁ జలనంబు గనని శాంతి
యుతున కగు నాత్మదర్శనం బతుల చరిత!

08. తే. జ్ఞాన విజ్ఞానతృప్తుండు కర్మయోగి
యాత్మయందునె నెలకొన్న యట్టి ఘనుఁడు,
యోగయుక్తుండు, విజితేంద్రియుండు మఱియు
మృత్తికాశ్మకాంచన సమచిత్తయుతుఁడు.

09. ఆ. సరసులందు మిత్రజనులం దుదాసీను
లందు సములయందు నహితులందు
బంధువులను సాధులందుఁ బాపులయందు
సమత నుండువాఁడె సత్తముండు.

10. ఆ. యోగి యుంచు మనసు యోగంబుననె నిరం
తరము చిత్త మాత్మ నిరతి సల్ప;
ఆశలెల్ల విడచి యపరిగ్రహుండు నే
కాకి యై రహస్యగతి వసించు.

11. ఆ. తగ్గుగాక యున్నతముగాక శుభ్రమై
నట్టిచోట సుస్థిరాసనమున
దర్భపఱుపు పేర్చి దానిపై వస్త్రకృ
ష్ణాజినములఁ జెలఁగు నటు లొనర్చి.

(6) శ్లో॥ 12 : తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుంజ్యాత్
యోగమాత్మవిశుద్ధయే ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 13 : సమం కాయశిరోగ్రీవం
ధారయన్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశశ్చానవలోకయన్ ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 14 : ప్రశాంతాత్మా విగతభీః
బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనః సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆసీత మత్పరః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 15 : యుంజన్నేవం సదాత్మానం
యోగీ నియత మానసః ।
శాంతి నిర్వాణ పరమాం
మత్సంస్థా మధిగచ్ఛతి ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 16 : నాత్యశ్నతస్తు యోగోస్తి
న చైకాంతమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య
జాగ్రతో నైవ చార్జున! ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 17 : యుక్తాహారవిహారస్య
యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య
యోగో భవతి దుఃఖహా ॥ (బ్రహ్మయోగము)

12. ఆ. కూరుచుండి యోగి వేఱెద్ది దలఁపక
యింద్రియముల మనసు నెల్లక్రియల
నియతములుగఁ జేసి నిర్మలాత్మప్రాప్తి
సభ్యసింపవలయు ననవరతము.

13. ఆ. కాయమును శిరంబుఁ గంతంబు మూఁటిని
సమముగా నచంచలముగ నిలిపి
పూర్ణదృష్టి తనదు భ్రూమధ్యమునఁ జేర్చి
దిశలఁ గననిరీతి స్థిర మొనర్చి.

14. ఆ. పరమశాంతుఁ డగుచు బ్రహ్మచర్యవ్రతం
బమరఁ బూని నిర్భయముగ నరుఁడు
మనసు నిగ్రహించి మచ్చిత్తుఁడై యోగ
యుక్తుఁ డగుచుఁ గూరుచుండవలయు.

15. ఆ. ఇట్లు యోగయుక్తుఁ డెల్లప్పుడును మాన
సమున నన్నె నిల్పి సవ్యసాచి!
నే ననుగ్రహించు నిర్వాణపరమ మౌ
శాంతి నొందఁగలుగు భ్రాంతి వీడి.

16. ఆ. అమితభోజనుండు నధికోపవాసుండు
నిదురపోతు మఱియు నిష్ఫలముగ
మేలుకొనెడువాఁడు మేదినిపై యోగ
మభ్యసింపఁజాలఁడని యెఱుఁగుము.

17. ఆ. మితముగా భుజించి మితవిహారముఁ జేసి
కర్మవిధుల మితముగా నొనర్చి
మితము లైననిద్ర మెలఁకువ ల్గలవాఁడు
వ్యసనములను బాసియగును యోగి.

(6) శ్లో॥ 18 : యదా వినియతం చిత్తమ్
ఆత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహః సర్వకామేభ్యో
యుక్త ఇత్యుచ్యతే తదా ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 19 : యథా దీపో నివాతస్థో
నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య
యుంజతో యోగమాత్మన ః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 20 : యత్రోపరమతే చిత్తం
నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాత్మానం
పశ్యన్నాత్మని తుష్యతి ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 21 : సుఖమాత్యంతికం యత్తత్
బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తియత్ర న చైవాయం
స్థితశ్చలతి తత్త్వతః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 22 : యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 23 : తం విద్యాద్దుఃఖసంయోగ
వియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో
యోగోనిర్విణ్ణచేతసా ॥ (బ్రహ్మయోగము)

18. ఆ. నియత మైనయట్టి నిర్మలచిత్తంబు
నెప్పు డాత్మయందు నిల్పఁగలఁడొ
సర్వకామరాగ సంబంధములు నప్పు
డతఁడు వీడి యోగ మాశ్రయించు.

19. తే. నియతచిత్తంబుతో యోగనిరతిఁ బూను
యోగయుక్తునియాత్మకునుపమ గాఁగఁ
బల్కఁబడుచుండు, పార్థ! నిర్వాతమైన
స్థలమున వెలుంగుదీపం బచంచలంబు.

20. ఆ. యోగసేవచేత రాగనిర్ముక్త మౌ
మదికి నెందుఁ గల్గు మహిత సుఖము,
మనసుచేత నాత్మఁగని యెందు మనుజుఁడా
నంద మొందు నాత్మ యందె తగిలి.

21. ఆ. ఎట్టి పరమసౌఖ్య మింద్రియాతీతంబు
గనుక బుద్ధి యొకటె కానఁగలుగు,
నేది యెఱిఁగి నిశ్చయించిన మనుజుండు
నిలుచు దాననే, చపలత మాని.

22. తే. దేనిఁ బొందినమనుజుండు దానికంటే
నితరముల నధికంబుగా నెంచుకొనఁడొ
ఎందుఁ జరియించునాతని కెంతదుఃఖ
ములు తటస్థించినను దాను గలఁత గనఁడొ.

23. తే. అట్టి దానినే యోగం బటంద్రు బుధులు
దుఃఖసంయోగ మద్దానఁ దొలఁగుఁ గనుక
దీని నిజతత్త్వ మెఱిఁగిన మానవుండు
వ్యాకులము వీడి యీ యోగమాచరించు.

(6) శ్లో॥ 24 : సంకల్పప్రభవాన్ కామాన్
త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం
వినియమ్య సమంతతః ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 25 : శనైః శనైరుపరమేత్
బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా
న కించిదపి చింతయేత్ ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 26 : యతో యతో నిశ్చరతి
మనశ్చంచలమస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైతత్
ఆత్మన్యేవ వశం నయేత్ ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 27 : ప్రశాంతమనసం హ్యేనం
యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం
బ్రహ్మభూతమకల్మషమ్ ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 28 : యుంజన్నేవం సదాత్మానం
యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమ్
అత్యంతం సుఖమశ్నుతే ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 29 : సర్వభూతాస్థమాత్మానం
సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శన ః ॥ (బ్రహ్మయోగము)

24. తే. అవని సంకల్పజనితంబులైన యాశ
లెల్ల నిశ్శేషముగ వీడి యింద్రతనయ!
మనసుచే నింద్రియముల సమస్తవిషయ
వర్జితములుగ నొనరింప వలయు సుమ్మి.

25. తే. మెలఁకువ గ్రహించి బుద్ధిని మెల్లమెల్ల
వాని సంబంధములనుండి వదలఁగొట్టి
మనసు స్థిరముగా నాత్మయందుననె నిల్పి
వేఱువిషయచింతన మెల్ల విడువవలయు.

26. తే. అధికచంచల మస్థిరమైనమనసు
దేనివైపునఁ బ్రాకుఁనో దానినుండి
మనుజుఁడద్దాని మరలించి మరల నాత్మ
యందె వశ మగురీతిఁ జేయంగవలయు.

27. తే. శాంతియుక్తుండు విగత రాజసగుణుండు
బ్రహ్మ మైనశుద్ధాత్మ రూపమునఁ జెలఁగు
ఘనుఁడు, నిష్కల్మషుండగుఁగాన, నెపుడు
నుత్తమం బగుసౌఖ్యంబు నొందఁగలఁడు.

28. తే. ఈ విధంబునఁ జేసి యోగీశుఁ డెప్పు
డాత్మయందె మనస్సు లయం బొనర్చి
పాపములు పోవ బ్రహ్మానుభవము పొంది
యపరిమిత మగునానంద మనుభవించు.

29. తే. యోగయుక్తాత్ముఁడైనట్టి యుత్తముండు
దాల్చు సమదృష్టి సర్వభూతములయందు;
ఆత్మ నఖిలభూతంబుల యందుఁ జూచు;
నాత్మయందవి యెల్ల నున్నట్లు దలఁచు.

(6) శ్లో॥ 30 : యో మాం పశ్యతి సర్వత్ర
సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి
స చ మే న ప్రణశ్యతి ॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(6) శ్లో॥ 31 : సర్వభూతస్థితం యో మాం
భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోపి
స యోగీ మయి వర్తతే ॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(6) శ్లో॥ 32 : ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమం పశ్యతి యోర్జున! ।
సుఖం వా యది వా దుఃఖం
స యోగీ పరమో మతః ॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

అర్జున ఉవాచ :-

(6) శ్లో॥ 34 : చంచలం హి మనః కృష్ణ !
ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే
వాయోరివ సుదుష్కరమ్ ॥ (బ్రహ్మయోగము)

శ్రీ భగవానువాచ :-

(6) శ్లో॥ 35 : అసంశయం మహాబాహో !
మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ !
వైరాగ్యేణ చ గృహ్యతే ॥ (బ్రహ్మయోగము)

30. తే. అఖిలజగమున ననుఁజూచి, యటులె యఖిల
జగము నాయందె వీక్షించు సజ్జనుండు;
వానినే నెన్నఁటికి వీడ; వాఁడు నన్ను
నెన్నఁటికి వీడి వసియింపఁ డింద్రతనయ.

31. తే. ఎల్లభూతంబులందునే నేకరూప
మున వసించుట నెవ్వడు గని భజించు
నట్టి యోగి వర్తించు నాయందె, యాతఁ
డెన్ని విధముల వర్తించుచున్నఁగాని.

32. తే. జగతి సర్వభూతములకు సంభవించు
వ్యసన మైనను సుఖమైన నాత్మసామ్య
ముగఁ దలంచుచు నంటని మోక్షగామి
యతులగుణవంతుఁ డంచు నామతము పార్థ !

అర్జునుడిట్లనియె :-

34. ఆ. అమితచంచలంబు నతిదృఢంబు బలంబు
నైన మనసు నిగ్రహంబొనర్ప
దుష్కరం బటంచుఁ దోఁచుచున్నది కృష్ణ !
గాలి నెవఁడు మూట గట్టఁగలఁడు?

శ్రీ భగవంతుడిట్లనియె :-

35. ఆ. సంశయంబు లేదు స్వాంత మత్యంతచం
చలము దాని నిల్పనలవి గాదు;
అట్టిదాని మనుజుఁడభ్యాస వై రాగ్య
ములఁ జరించి నిల్పవలయుఁ బార్థ !

(6) శ్లో॥ 36 : అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా
శక్యోవాప్తుముపాయతః ॥ (బ్రహ్మయోగము)

అర్జున ఉవాచ :-

(6) శ్లో॥ 37 : అయతిః శ్రద్ధయోపేతో
యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం
కాం గతిం కృష్ణ! గచ్ఛతి ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 38 : కచ్చిన్నోభయవిభ్రష్టః
ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో!
విమూఢో బ్రహ్మణః పథి ॥ (బ్రహ్మయోగము)

(6) శ్లో॥ 39 : ఏతన్మే సంశయం కృష్ణ !
ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యః సంశయంస్యాస్య
ఛేత్తా న హ్యుపపద్యతే ॥ (బ్రహ్మయోగము)

శ్రీ భగవానువాచ :-

(6) శ్లో॥ 40 : పార్థ! నైవేహ నాముత్ర
వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్ కశ్చిత్
దుర్గతిం తాత గచ్ఛతి ॥ (జీవుడు)

36. ఆ. మనసు నిలుపలేని మనుజున కీయోగ
పథము నొంద దుర్లభంబు గాన,
వశ్యమానసం బవశ్యంబుగా, నుపా
య మగు కర్మయోగమందె కల్గు.

అర్జునుడిట్లనెయె :-

37. ఆ. శ్రద్ధ గలిగియుండి సంపూర్ణయతనుండు
గానియట్టి చలిత మానసునకు
యోగసిద్ధిఁ జెంద కుండుటయే కాక
యేమిగతులు పుట్టు నింది రేశ!

38. తే. ఆత్మదర్శన మార్గమందప్రతిష్ఠుఁ
డైనమూఢునిగతి యేమి యంబుజాక్ష !
ఛిన్న మేఘంబు రెంటికిఁ జెడినరీతి
నుభయవిభ్రష్టుఁ డతఁడు గాకుండునొక్కొ.

39. తే. సరసిజాక్ష ! నా కున్నయీ సంశయంబు
ఛేద మొనరింపవలయు సశేషముగను;
ఇట్టు లొనరింప నీకంటె నితరుఁడొకడు
కలుగఁ గలఁ డొక్క జగతిలోఁ గమలనయనఁ

శ్రీ భగవంతుడిట్లనియె :-

40. ఆ. ఇహమునందు నాశమెన్నండుఁ గనఁడట్టి
వాఁడు చెడుపు గనఁడు పరమునందు;
సకలశుభము లొసఁగు సత్కార్య మొనరింప,
నశుభములు తటస్థమగుట గలదె?

(6) శ్లో॥ 41 : ప్రాప్య పుణ్యకృతాం లోకాన్
ఉషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే
యోగభ్రష్టోభిజాయతే ॥ (జీవాత్మ)

(6) శ్లో॥ 42 : అథవా యోగినామేవ
కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం
లోకే జన్మ యదీదృశమ్ ॥ (జీవాత్మ)

(6) శ్లో॥ 43 : తత్ర తం బుద్ధిసంయోగం
లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయః
సంసిద్ధౌ కురునందన! ॥ (జీవాత్మ)

(6) శ్లో॥ 44 : పూర్వాభ్యాసేన తేనైవ
హ్రియతే హ్యవశోపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య
శబ్దబ్రహ్మాతివర్తతే ॥ (జీవాత్మ)

(6) శ్లో॥ 45 : ప్రయత్నాద్యతమానస్తు
యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధః
తతో యాతి పరాం గతిమ్ ॥ (జీవాత్మ)

41. తే. అర్జునా ! యోగమున భ్రష్టులైనవారు
సుకృతపరు లేఁగులోకముల్ సొచ్చి పెక్కు
వత్సరము లుండి పుణ్యులైశ్వర్యవంతు
లైన వారిండ్ల నుద్భవమందుచుంద్రు.

42. తే. అట్లు గాదేని ధీమంతులైన యోగ
వరులయిండ్లనె జన్మంబు వడయుచుంద్రు;
ఎంతయో దుర్లభము గాదె యిట్టి జన్మ
మిలను సామాన్య జనులయందెవరికైన

43. తే. అటులు జన్మించి పూర్వదేహములఁ గలిగి
నట్టి బుద్ధి యోగంబు తామందుచుంద్రు;
మరల సంపూర్ణయత్నంబు జరిపి యోగ
మందు సంసిద్ధిఁ బొందుదురవనిజనులు.

44. తే. వివశు లయ్యును దద్యోగవిషయమందె
వారు చరియింతు రభ్యాసవశముచేత;
యోగజిజ్ఞాసులుం గూడ నుర్వి విజయ
మందుచుంద్రు శబ్దబ్రహ్మ మధికరించి

45. తే. కాన, నిర్ధూతకిల్బిషుండైనయత్న
వరుఁడనేకజన్మంబులఁబడసి, తనకుఁ
గలిగియుండినపాపముల్ తొలఁగఁబుచ్చి
శ్రేష్ఠమైన యీయోగసంసిద్ధిఁ జెందు.

(5) శ్లో॥ 46 : తపస్విభ్యోధికో యోగీ
జ్ఞానిభ్యోపి మతోధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ
తస్మాద్యోగీ భవార్జున! ॥ (జీవాత్మ)

(6) శ్లో॥ 47 : యోగినామపి సర్వేషాం
మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం
స మే యుక్తతమో మతః॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**ఆత్మసంయమయోగోనామ**
**షష్ఠోధ్యాయః**



46. తే. యోగి, తపసులకంటెను నుత్తముండు
జ్ఞానవంతులకంటెను ఘనుఁడు, మఱియుఁ
గర్మములఁ జేయువారలకంటె నధికుఁ
డగుట నర్జున! యోగి వీవగుదుగాక!

47. ఆ. సర్వయోగులందు సంపూర్ణముగ నెవ్వఁ
డంతరాత్మ నన్నె యాశ్రయించి
శ్రద్ధ గలిగి భజన సల్పు, నాతఁడు యుక్త
తముఁ డటంచు నేను దలఁచుచుందు.

**బ్రహవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**ఆరవ అధ్యాయము ఆత్మసంయమ యోగము సమాప్తము.**



ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ సప్తమోధ్యాయః - విజ్ఞానయోగః

శ్రీ భగవానువాచ :-

(7) శ్లో॥ 1 : మయ్యాసక్తమనాః పార్థ!
యోగం యుంజన్ మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం
యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ (జీవాత్మ, పరమాత్మ)

(7) శ్లో॥ 2 : జ్ఞానం తేహం సవిజ్ఞానమ్
ఇదం వక్ష్యామ్యశేషతః ।
యద్జ్ఞాత్వా నేహ భూయోన్యత్
జ్ఞాతవ్యమవశిష్యతే ॥ (జీవాత్మ)

(7) శ్లో॥ 3 : మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః । (జీవాత్మ)

(7) శ్లో॥ 4 : భూమిరాపోనలో వాయుః
ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతిరష్టధా ॥ (ప్రకృతి)

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

## శ్రీ మద్భగవద్గీత

సప్తమాధ్యాయము.

## విజ్ఞాన యోగము

శ్రీ భగవంతుడిట్లనియె :-

01. తే. కాంక్ష నాయందె కల్గి యోగం బొనర్చి
యాశ్రయము లేదు నాకంటె ననుచుఁ దలఁచి
నన్ను సంపూర్ణ మైనజ్ఞానంబుతోడ
సంశయము లేక తెలిసెడు సరణి వినుము.

02. తే. జ్ఞానమును నీకు నేఁడు విజ్ఞానసహిత
ముగ వచించెద నిశ్శేషముగఁ గిరీటి!
ఏది యరసిన పిమ్మట నింక నొకటి
యరయవలసిన దుండదో యట్టి దాని.

03. తే. నరులలో సిద్ధికై ప్రయత్నంబు సేయు
వాఁడు వేయింటి కొకఁడు గన్పట్టు టరుదు
అట్లు యత్నించువారలయందు సహిత
మెవ్వడో యొక్కఁడుండు నన్నెఱుఁగువాడు.

04. ఆ. అవనియును జలంబులగ్నియు వాయు వా
కాశమును మనస్సు గలిసి బుద్ధి
యును నహంకరమునని యష్ట విధముల
నాడు ప్రకృతి చెలఁగు నవ్యచరిత !

(7) శ్లో॥ 5 : అపరేయమితస్త్వన్యాం
ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో !
యయేదం ధార్యతే జగత్ ॥ (ప్రకృతి, పరమాత్మ)

(7) శ్లో॥ 6 : ఏతద్యోనీని భూతాని
సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః
ప్రభవః ప్రళయస్తథా ॥ (ప్రకృతి, పరమాత్మ)

(7) శ్లో॥ 7 : మత్తః పరతరం నాన్యత్
కించిదస్తి ధనంజయ! ।
మయి సర్వమిదం ప్రోతం
సూత్రే మణిగణా ఇవ ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 8 : రసోహమప్సు కౌంతేయ!
ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు
శబ్దః ఖే పౌరుషం నృషు ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 9 : పుణ్యోగంధః పృథివ్యాం
చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు
తపశ్చాస్మి తపస్విషు ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 10 : బీజం మాం సర్వభూతానాం
విద్ధి పార్థ! సనాతనమ్ ।
బుద్ధిర్బుద్ధి మతామస్మి
తేజస్తేజస్వినామహమ్ ॥ (పరమాత్మ)

05. తే. ఇట్టి ప్రకృతి నికృష్ణ మౌనింద్రతనయ!
యఖిలజగముల కాధారమగుచు మిగుల
శ్రేష్ఠమై జీవరూపమై చెలఁగు ప్రకృతి
వేఱు గాఁగ నెఱుంగుమీ వీరవర్య !

06. ఆ. సర్వభూతములకు జన్మ మీ చేతనా
చేతన ప్రకృతులు చేయుచుండు;
నేన హేతు వగుదు నిఖిలజగంబుల
ప్రభవమునకు మఱియుఁ బ్రళయమునకు.

07. ఆ. నన్ను మించి ఘనత గన్నది వేఱొకం
డేదిగాని జగతి లేదు పార్థ!
దారమందు మణులు ధరియింప బడునట్లు
నిఖిల లోకములను నే ధరింతు.

08. తే. జలమునందున్నయట్టి రసంబు నేన;
చంద్ర సూర్యులకున్న తేజంబు నేన;
ప్రణవమును నేన శ్రుతులందు; ధ్వనిని నేన
గగనమునఁ; బురుషుల కేన మగతనంబు.

09. తే. పుణ్యగంధంబు నేన యీ పుడమియందు
జ్వలనుఁ డిలఁ జూపునట్టి తేజంబు నేన;
జీవనము నేన సుమి సర్వజీవములకు;
తాపసశ్రేష్ఠు లొనరించు తపము నేన.

10. తే. సర్వభూతంబులకును బీజంబు నేన
శాశ్వతంబుగ నగుచుందు సవ్యసాచి!
బుద్ధి మంతులయందలి బుద్ధి నేన;
సకల తేజస్యులందుఁ దేజంబు నేన.

(7) శ్లో॥ 11 : బలం బలవతాం చాహం
కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు
కామోస్మి భరతర్షభ! ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 12 : యే చైవ సాత్త్వికా భావా
రాజసాస్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తాన్ విద్ధి
న త్వహం తేషు తే మయి ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 13 : త్రిభిర్గుణమయైర్భావైః
ఏభిః సర్వమిదం జగత్ ॥
మోహితం నాభిజానాతి
మామేభ్యః పరమవ్యయమ్ ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 14 : దైవీ హ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే
మాయామేతాం తరంతి తే ॥ (పరమాత్మ)

(7) శ్లో॥ 15 : న మాం దుష్కృతినో మూఢాః
ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానా
ఆసురం భావమాశ్రితాః ॥ (జీవాత్మ,పరమాత్మ)

(7) శ్లో॥ 16 : చతుర్విధా భజంతే మాం
జనాః సుకృతినోర్జున ! ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ ! ॥ (జీవాత్మ,పరమాత్మ)

11. తే. కామరాగవివర్జిత ఘనగుణు లగు
బలసమేతులయందలి బలము నేన;
ధర్మముఁగ జరియించు భూతములయందుఁ
గామ మే నౌదు నెపుడు సుత్రామతనయ!

12. తే. సాత్త్వికము లైన, మఱియు రాజసము లైనఁ
దామసము లైన నిలఁ బదార్థముల కెల్లఁ
బ్రభవ మెపుడును గలుగు నావలన; వాని
యందు నే నిల్వ, నవియ నాయందు నిలుచు.

13. తే. ఈజగం బెల్ల సాత్త్విక రాజసమయ
తామసమయంబు నౌటచే నామహత్త్య
మవ్యయం బని శ్రేష్ఠం బటనియు జనము
లరయఁజాలక మోహంబు నందియుంద్రు

14. తే. దైవరచితమౌ నామాయ దాఁటఁగల్గు
టధికకష్టంబు గావున నవనియందు
నన్ను శరణంబుఁ జొచ్చెడు నరులు దాని
దాఁటుదురు శీఘ్రగతిని సుత్రామతనయ !

15. తే. పాపకర్ములు మూఢులు మానుషాధ
ములును నజ్ఞానవిభ్రాంతి మెలఁగువార
లసురభావంబుఁ జెందిన యట్టి జనులు
న న్నుపాసించునట్టి జ్ఞానంబుఁ గనరు.

16. తే. నన్ను భజియించు మనుజులు నాల్గుతెఱఁగు
లగుదు రలపుణ్యకర్ములయందుఁ బార్థ!
ఆర్తుఁడును మఱిజిజ్ఞాసువర్థకామి
జ్ఞాని యని వారినామముల్జగతియందు.

(7) శ్లో॥ 17 : తేషాం జ్ఞానీ నిత్యయుక్త
ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోత్యర్థమ్
అహం స చ మమ ప్రియః (జీవాత్మ,పరమాత్మ)

(7) శ్లో॥ 18 : ఉదారాః సర్వ ఏవైతే
జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థితః స హి యుక్తాత్మా
మామేవానుత్తమాం గతిమ్ ॥ (జీవాత్మ,పరమాత్మ)

(7) శ్లో॥ 19 : బహూనాం జన్మనామంతే
జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి
స మహాత్మా సుదుర్లభః ॥ (జీవాత్మ,సాకారము)

(7) శ్లో॥ 20 : కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః
ప్రపద్యంతేన్యదేవతాః ।
తం తం నియమమాస్థాయ
ప్రకృత్యా నియతాః స్వయా ॥ (జీవాత్మ)

(7) శ్లో॥ 21 : యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ విదధామ్యహమ్ ॥ (జీవాత్మ)

(7) శ్లో॥ 22 : స తయా శ్రద్ధయా యుక్తః
తస్యారాధనమీహతే ।
లభతే చ తతః కామాన్
మయైవ విహితాన్ హి తాన్॥ (జీవాత్మ)

17. ఆ. వారిలోన నిత్య బంధువై నాయందె
చేయు భక్తి జ్ఞాని శ్రేష్ఠుఁడగుచు;
అట్టివాని కగుదు నత్యంతప్రియుఁడను;
వాఁడు నట్టె నాకుఁ బరమప్రియుఁడు.

18. తే. వీర లెల్ల రుదారులే వీరవర్య !
అందు, జ్ఞానినిఁ దలఁతు నాయాత్మ యనుచు
నతఁడు నాతోడియోగంబు నందఁగోరి
భావనము సేయుఁ బరమప్రాప్యముగ నన్ను.

19. తే. పుణ్యజన్మంబులను బొంది పొంది, తుదకుఁ
బ్రాప్యమును బ్రాపకంబు సర్వమును వాసు
దేవుఁడే యని జ్ఞాని చింతించు నన్ను;
దుర్లభుండును మఱి మహాత్ముండు వాఁడు.

20. తే. ప్రకృతి సంబంధములగు పాపములచేతఁ
గామములయందు మున్గి యజ్ఞాను లగుచు
నన్యదేవతారాధన లాచరింత్రు
వారి నియమాదు లెల్లఁ దప్పక చరించి.

21. తే. ఎవ్వఁ డెవ్వండు శ్రద్ధతో నెట్టి యెట్టి
మూర్తి భావించి పూజింప మురియుచుండు
వానివాని కాశ్రద్ధయే వదలకుండ
నిలుచునట్టు లొనర్తు, నే నిశ్చలముగ.

22. ఆ. వాఁడు నట్టి శ్రద్ధవహియించి యాదేవ
తనె యుపాసనమున వినతిసేయఁ
గలుగు దానివలనఁ గామ్యార్థ సిద్ధి, వా
నికి హితంబు గోరి నే నొసంగ.

(7) శ్లో॥ 23 : అంతవత్తు ఫలం తేషాం
తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్ దేవయజో యాంతి
మద్భక్తా యాంతి మామపి॥ (జీవాత్మ)

(7) శ్లో॥ 24 : అవ్యక్తం వ్యక్తిమాపన్నం
మన్యంతే మామబుద్ధయః ।
పరం భావమజానంతో
మమావ్యయమనుత్తమమ్ ॥ (జీవాత్మ, పరమాత్మ)

(7) శ్లో॥ 25 : నాహం ప్రకాశః సర్వస్య
యోగమాయాసమావృతః ।
మూఢోయం నాభిజానాతి
లోకో మామజ మవ్యయమ్ ॥ (జీవాత్మ, పరమాత్మ)

(7) శ్లో॥ 26 : వేదాహం సమతీతాని
వర్తమానాని చార్జున! ।
భవిష్యాణి చ భూతాని
మాం తు వేద న కశ్చన ॥ (జీవాత్మ, పరమాత్మ)

(7) శ్లో॥ 27 : ఇచ్ఛా ద్వేష సముత్థేన
ద్వంద్వమోహేన భారత ! ।
సర్వభూతాని సమ్మోహం
సర్గే యాంతి పరంతప! ॥ (జీవాత్మ, ప్రకృతి)

(7) శ్లో॥ 28 : యేషాం త్వంతగతం పాపం
జనానాం పుణ్యకర్మణామ్।
తే ద్వంద్వమోహనిర్ముక్తా
భజంతే మాం దృఢవ్రతాః ॥ (జీవాత్మ, పరమాత్మ)

23. ఆ. అల్పబుద్ధులైన యట్టి వారలు పొందు
ఫలము లెల్ల నంత వంతము లగు;
దేవభక్తులెల్ల దేవతలను జెంద
నన్నుఁ జెందఁగలరు నాదుప్రియులు.

24. ఆ. అవ్యయంబు మరియు నత్యుత్తమము, మదీ
యంబు పరమభావ మరయలేక
బుద్ధిహీనులైన పురుషులు గొంద ఱ
వ్యక్తుఁడైన నన్ను వ్యక్తుఁ డండ్రు.

25. ఆ. యోగమాయ గప్పి యున్నట్టి ననుఁజూడ
నఖిలజనములకును నలవి కాదు;
అవ్యయుండ నగుచు నజుఁడనై యొప్పు నా
రూఢి దెలియఁగలరె మూఢజనులు.

26. ఆ. తెలియు నాకు, భూతములకెల్ల జగతిలో
జరిగినట్టి మఱియు జరుగుచున్న
యట్టి జరుగఁబోవు నట్టి వృత్తాంతముల్;
యిట్టి నన్నెరుంగడెవడుగాని.

27. తే. రాగమును ద్వేషమును జెల రేఁగఁ జేయు
ద్వంద్వములు పొడసూ పవిభ్రాంతిఁ జెంది
మోహమున నెల్ల ప్రాణులు మునుఁగుచుండు
జననకాలంబు మొదలుగా సవ్యసాచి !

28. ఆ. పుణ్యకర్ములైన పురుషులపాపంబు
క్షీణ మగుడు వారి చేతమందు
ద్వంద్వమోహముక్తి ప్రబలి వారలు దృఢం
బైననాదుభక్తి నందుచుండ్రు.

(7) శ్లో॥ 29 : జరామరణమోక్షాయ
మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమ్
అధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ (జీవాత్మ, పరమాత్మ)

(7) శ్లో॥ 30 : సాధిభూతాధిదైవం మాం
సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేపి చ మాం
తే విదుర్యుక్తచేతసః ॥ (జీవాత్మ, పరమాత్మ)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**విజ్ఞానయోగో నామ**
**సప్తమోధ్యాయః**



29. తే. జగతి నీజరామరణ మోక్షంబుకొఱకు
నేన యాధార మనుచు యత్నింతు రెవ్వ
రట్టిపూరుషు లవలీల నరయఁగలరు
బ్రహ్మ మధ్యాత్మ మఖిలకర్మములు పార్థ !

30. తే. భూతముల కెల్ల నాధారభూతుఁడ నని
దేవదేవుఁడ ననియును దెలిసి, సర్వ,
యజ్ఞములు నాకె చేరు నంచరయువారు
గాంచుచుందురు న న్నంత్యకాలమునను.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**ఏడవ అధ్యాయము విజ్ఞానయోగము సమాప్తము.**



ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ అష్టమోధ్యాయః - అక్షర పరబ్రహ్మయోగః

అర్జున ఉవాచ :-

(8) శ్లో॥ 1 : కిం తద్బ్రహ్మ? కిమధ్యాత్మం?
కిం కర్మ పురుషోత్తమ! ।
అధిభూతం చ కిం? ప్రోక్తమ్
అధిదైవం కిముచ్యతే? ॥ (ప్రకృతి, ఆత్మ, పరమాత్మ)

(8) శ్లో॥ 2 : అధియజ్ఞః కథం కోఽత్ర
దేహేస్మిన్ మధుసూదన ! ।
ప్రయాణకాలే చ కథం
జ్ఞేయోసి నియతాత్మభిః ॥ (ఆత్మ, పరమాత్మ)

శ్రీ భగవానువాచ :-

(8) శ్లో॥ 3 : అక్షరం బ్రహ్మ పరమం
స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో
విసర్గః కర్మసంజ్ఞితః ॥ (ప్రకృతి, పరమాత్మ)

(8) శ్లో॥ 4 : అధిభూతం క్షరో భావః
పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోహమేవాత్ర
దేహే దేహభృతాం వర ॥ (ఆత్మ)

(8) శ్లో॥ 5 : అంతకాలే చ మామేవ
స్మరన్ ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం
యాతి నాస్త్యత్ర సంశయః (ఆత్మ, పరమాత్మ)

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మద్భగవద్గీత

అష్టమాధ్యాయము

## అక్షర పరబ్రహ్మ యోగము

అర్జునుడిట్లనియె :-

01. ఆ. అట్టిబ్రహ్మమేది? యాత్మకాధారం బ
దేది? కర్మమేది? యేది భూత
ములకు నెలవు? దైవముల కేది దైవంబు?
ఎఱుఁగఁ జెప్పు మిప్పుడింది రేశ!

02. ఆ. యజ్ఞములుఁ గ్రతువులు నాహార మెవనికి?
అతఁడు కాయ మెట్టులధివసించు?
నియమితాత్ము లెట్లు నిను దర్శన మొనర్పఁ
గలరు వారియంత్యకాలమందు?

శ్రీ భగవంతడిట్లనియె :-

03. తే. ప్రకృతినిర్ముక్తశుద్ధాత్మ బ్రహ్మ మంద్రు;
ఆత్మ కాధారభూత మౌనంద్రు ప్రకృతి;
భూతభావంబులను భూమిఁ బుట్టునట్లు
ఘటన సేయు విసర్గమే కర్మ మంద్రు.

04. తే. పరఁగు నధిభూత మన, క్షరోభావ మగుచుఁ
బురుష నధి దైవతంబుగా నెఱుఁగవలయు;
యజ్ఞముల కెల్ల భోక్త నేనగుదు సుమ్ము;
సర్వదేహంబులందుండి సవ్యసాచి !

05. ఆ. అంత్యకాలమందు నవని నన్నెవ్వండు
స్మరణ చేసికొనుచు మరణ మొందు
వాఁడు పిదప నాదు భావంబునే పొందు;
నిందు సంశయంబుఁ జెందవలదు.

(8) శ్లో॥ 6 : యం యం వాపి స్మరన్ భావం
త్యజత్యంతే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ!
సదా తద్భావభావితః ॥ (జీవాత్మ)

(8) శ్లో॥ 7 : తస్మాత్ సర్వేషు కాలేషు
మామనుస్మర యుధ్యచ ।
మయ్యర్పితమనోబుద్ధిః
మామేవైష్యస్యసంశయః ॥ (ఆత్మ, సాకారము)

(8) శ్లో॥ 8 : అభ్యాసయోగయుక్తేన
చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం
యాతి పార్థా నుచింతయన్॥ (ఆత్మ, పరమాత్మ)

(8) శ్లో॥ 9 : కవిం పురాణమనుశాసితారమ్
అణోరణీయాం సమనుస్మరేద్యః ।
సర్వస్య ధాతారమచింత్యరూపమ్
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(8) శ్లో॥ 10 : ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥(జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(8) శ్లో॥ 11 : యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్షే ॥ (పరమాత్మ)

06. తే. ఎట్టి భావంబు మనసునందెంచుకొనుచు
జనుఁడు దేహంబు విడుచుట సంభవించు
నట్టి భావంబునే యతఁడందుచుండు
వాని కెల్లప్పు డదియ యభ్యాసమగుట.

07. తే. కనుక సర్వకాలముల నీ మనసునందు
నన్ను స్మరియించు చుండుము నయచరిత్ర!
మనసు బుద్ధియు మత్సమర్పణ మొనర్చి
చేరఁగల్గుదు నన్నె నిశ్చింతతోడ.

08. తే. అర్జునా ! ధ్యానమునను నభ్యాసమునను
మనసునందును విషయ చింతనము మాని
పరమపూరుషు దివ్యప్రభావు నన్నుఁ
దలఁచుచుండిన, ననుఁ జెందఁగలఁడు నరుఁడు.

09. తే. సర్వదర్శి ననాద్యునిసర్వలోక
శాసనుని, సూక్ష్మములకు సూక్ష్మమగువాని
సృష్టి కారణకర్త నచింత్యరూపుఁ
బ్రకృతివరు సూర్యవర్ణు నెవ్వఁడు భజించు.

10. ఆ. ఆతఁ డంత్యకాలమం దచలుం డౌచు
భక్తి గలిగి యోగ బలము గలిగి
బొమలమధ్యఁ బ్రాణమును లెస్సగా నిల్పి
పరమపురుషుఁ జేరు భాగ్య మొందు.

11. తే. ఏది యక్షరం బని యంద్రు వేదవేత్త
లేది గమ్యస్థలంబు జితేంద్రియులకు
బ్రహ్మచర్యంబుచే దేనిఁ బడయ నెంతు
రాపదమె యక్షరము, సంగ్రహముగ వినుతు.

(8) శ్లో॥ 12 : సర్వద్వారాణి సంయమ్య
మనో హృది నిరుధ్యచ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమ్
ఆస్థితో యోగధారణామ్॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(8) శ్లో॥ 13 : ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్ మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం
స యాతి పరమాం గతిమ్ ॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(8) శ్లో॥ 14 : అనన్యచేతాః సతతం
యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ!
నిత్యయుక్తస్య యోగినః ॥ (పరమాత్మ)

(8) శ్లో॥ 15 : మాముపేత్య పునర్జన్మ
దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మానః
సంసిద్ధిం పరమాం గతాః ॥ (పరమాత్మ)

(8) శ్లో॥ 16 : ఆబ్రహ్మభువనాల్లోకాః
పునరావర్తినోర్జున ! ।
మామూపేత్య తు కౌంతేయ !
పునర్జన్మ న విద్యతే ॥ (పరమాత్మ)

(8) శ్లో॥ 17 : సహస్రయుగపర్యంతమ్
అహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం
తేహెూరాత్రవిదో జనాః॥ (పరమాత్మ)

12. తే. ఎల్లద్వారంబులను నియమించి నరుఁడు
మనసు బంధించి, హృది మధ్యముననె నిలిపి
ప్రాణవాయువు శిరములోపల నిమిడ్చి
యోగబలమున ధారణ బాగుపఱచి.

13. తే. బ్రహ్మవాచక మైనట్టి ప్రణవ ముచ్చ
రించుచును, దాన నన్ను ధ్యానించుకొనుచు,
కాయమును విసర్జన సేయఁ గలిగెనేని
యరుగఁగలఁ డాతఁ డుత్కృష్టమైనగతికి.

14. తే. వేఱుచింతల మనసునఁజేరనీక
సర్వదా నన్నె యెవ్వండు స్మరణసేయు,
నట్టివానికి సులభుండనగుదు నేను;
యోగి యాతఁడె, మఱి నిత్యయుక్తుఁ డతఁడె.

15. తే. శ్రేష్ఠమైనట్టి యోగసం సిద్ధి పడయు
జనులు నను బొంది, పిమ్మటఁ గనరు దుఃఖ
భాజనంబులు నస్థిరభంగురంబు
లౌపునర్జన్మములను బలారితనయ!

16. ఆ. బ్రహ్మలోక మాది పరఁగెడుసర్వలో
కములు మరల జన్మ మమరఁజేయు;
నన్నుఁ బొందునట్టి నరులు పునర్జన్మ
మందఁబోరు మరల ననఘచరిత!

17. ఆ. యుగసహస్ర మొక్క పగలు బ్రహ్మకు; మఱి
యట్లె యుగసహస్రమతని రాత్రి;
దీనిఁ దెలియువారు గానఁగల్గుదు రహో
రాత్రములకుఁ గలతెఱంగు పార్థ !

(8) శ్లో॥ 18 : అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః
ప్రభవంత్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయంతే
తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥ (పరమాత్మ, జీవాత్మ)

(8) శ్లో॥ 19 : భూతగ్రామః స ఏవాయం
భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేవశః పార్థ !
ప్రభవత్యహరాగమే ॥ (జీవాత్మ)

(8) శ్లో॥ 20 : పరస్తస్మాత్తు భావోన్యో
వ్యక్తోవ్యక్తాత్ సనాతన ః
యః స సర్వేషు భూతేషు
నశ్యత్సు న వినశ్యతి ॥ (పరమాత్మ)

(8) శ్లో॥ 21 : అవ్యక్తోక్షర ఇత్యుక్తః
తమాహుః పరమాం గతిమ్ ।
యం ప్రాప్య న నివర్తంతే
తద్ధామ పరమం మమ ॥ (పరమాత్మ)

(8) శ్లో॥ 22 : పురుషః స పరః పార్థ !
భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
యస్యాంతఃస్థాని భూతాని
యేన సర్వమిదం తతమ్ ॥ (పరమాత్మ)

(8) శ్లో॥ 23 : యత్ర కాలే త్వనావృత్తిమ్
ఆవృత్తిం చైవ యోగినః ।
ప్రయాతా యాంతి తం కాలం
వక్ష్యామి భరతర్షభ! ॥ (జీవాత్మ, మోక్షము)

18. తే. వ్యక్త మెల్లను నవ్యక్త మందు నుండి
బ్రహ్మపగటిని జగతిగాఁ బ్రభవ మందు
బ్రహ్మరాత్రంబు మొదలుగా మరల జగతి
మాఱి యవ్యక్త మగుచుండు మాన్యచరిత!

19. తే. భూతసముదాయ మెల్ల నీరీతిఁ గర్మ
వశత నుదయించి యుదయించి పగలు వోవఁ
బ్రళయమును బొందుచుండును రాత్రియందు;
పగలు వచ్చినవెంటనే ప్రభవ మందు.

20. తే. అవ్యయంబు నచేతనంబైనయిట్టి
ప్రకృతికంటెను నిత్యమై పరమ మగుచు
జగతి మాసినఁ దాను నాశనము గాని
యన్య మగుభావ మవ్యక్తమగుచుఁ గలదు.

21. తే. అదియు నవ్యక్త మక్షరం బనఁగఁ బరఁగు
బరమగతి గాఁగ నద్దాని నెఱుఁగవలయు;
అది లభించిన, జన్మంబులంత మొందు;
దాని నాదగు నియమన స్థాన మంద్రు.

22. తే. ఎల్లభూతంబులు వసించు నెవనిలోన
నెవనిచే వ్యాప్తమై యుండు నీజగంబు,
అట్టి పురుషుని నుత్కృష్టమై యనన్య
మైన భక్తి చేఁ జెందఁగా నగును బార్థ !

23. తే. యోగు లెప్పుడు మరణంబు నొందునెడల
మరల జన్మంబు లందరో మఱియు నెట్టి
తఱిని మరణించుచో వారు మరల ధరణి
యందు జనియింతురో విను మది వచింత.

(8) శ్లో॥ 24 : అగ్నిర్జ్యోతిరహః శుక్లః
షణ్మాసా ఉత్తరాయణమ్ ॥
తత్ర ప్రయాతా గచ్ఛంతి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ (జీవాత్మ, మోక్షము)

(8) శ్లో॥ 25 : ధూమో రాత్రిస్తథా కృష్ణః
షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాంద్రమసం జ్యోతిః
యోగీ ప్రాప్య నివర్తతే ॥ (జీవాత్మ)

(8) శ్లో॥ 26 : శుక్లకృష్ణే గతీ హ్యేతే
జగతః శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తిమ్
అన్యయావర్తతే పునః ॥ (జీవాత్మ)

(8) శ్లో॥ 27 : నైతే సృతీ పార్థ! జానన్
యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్ సర్వేషు కాలేషు
యోగయుక్తో భవార్జున! ॥ (జీవాత్మ)

(8) శ్లో॥ 28 : వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపై తిచాద్యమ్ ॥ (జీవాత్మ, మోక్షము)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**

**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**

**అక్షరపరబ్రహ్మయోగోనామ**

**అష్టమోధ్యాయః**

24. ఆ. అగ్నితేజమందు నహమందు శుక్ల ప
క్షమున ను త్తరాయణమున బ్రహ్మ
విదుల కెల్ల మరణమొదవిన, వారికి
బ్రహ్మపదముఁ బొందు భాగ్య మబ్బు.

25. తే. ధూమమందును రాత్రియందునను గృష్ణ
పక్షమందును మఱియును దక్షిణాయ
నమున మరణింపఁ జంద్రతేజమును బొంది
యోగిజనుఁడు చెందును బునరుద్భవంబు.

26. ఆ. కలవు పార్థ ! రెండు గతులుగా శుక్లకృ
ష్ణంబు లనుచు యోగిజనుల కెల్ల;
అందు నొకట యోగి చెందు ననావృత్తి
మఱియొకంటఁ జనిన మరలఁ బుట్టు

27. ఆ. ఇట్టి రెండు తెఱఁగు లెఱిఁగినయోగిపుం
గవున కెపుడు భ్రాంతి గలుగఁబోదు;
కనుక నీవు సర్వకాలంబులను బార్థ !
యోగయుక్తుఁడవుగ నుండవలయు.

28. ఆ. దీని నెఱుఁగువాఁ డతిక్రమించుచు వేద
ములఁ దపముల యజ్ఞములను దాన
ములఁ జెలం గుపుణ్య ఫలముల, జ్ఞానియై
పరమ మైన యాది పదముఁ బొందు.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**ఎనిమిదవ అధ్యాయము అక్షరపరబ్రహ్మయోగము సమాప్తము.**

ఓం శ్రీపరమాత్మనే నమః

## అథ నవమోధ్యాయః - రాజవిద్యా రాజగుహ్యాయోగః

శ్రీ భగవానువాచ :-

(9) శ్లో॥ 1 : ఇదం తు తే గుహ్యతమం
ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం
యద్జ్ఞాత్వా మోక్ష్యసేశుభాత్ ॥ (ధర్మములు)

(9) శ్లో॥ 2 : రాజవిద్యా రాజగుహ్యం
పవిత్రమిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం
సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ (ధర్మములు)

(9) శ్లో॥ 3 : అశ్రద్ధధానాః పురుషా
ధర్మస్యాస్య పరంతప! ।
అప్రాప్య మాం నివర్తంతే
మృత్యుసంసారవర్త్మని ॥ (ధర్మములు)

(9) శ్లో॥ 4 : మయా తతమిదం సర్వం
జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని
న చాహం తేష్వవస్థితః ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 5 : న చ మత్స్థాని భూతాని
పశ్య మే యోగమైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో
మమాత్మా భూతభావనః ॥ (పరమాత్మ)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మద్భగవద్గీత

నవమాధ్యాయము.

## రాజవిద్యా రాజగుహ్య యోగము

శ్రీ భగవంతుడిట్లనియె :-

01. ఆ. దీని నతిరహస్యమైనజ్ఞానమును వి
జ్ఞానసహితముగ విశద మొనర్తు;
అట్టి దెఱుఁగ నెల్ల యశుభంబులును నిన్నుఁ
బాయు; వినుము నీ వసూయ లేక.

02. తే. అతులవిద్యలయందు గుహ్యములయందు
రాజమైయుత్తమముఁ బవిత్రంబు నగుచు
నవనిఁబ్రత్యక్షవిషయికమైనధర్మ్య
మవ్యయం బనుష్ఠానసౌఖ్యప్రదంబు.

03. ఆ. ఇట్టిధర్మమం దొకిం తైన శ్రద్ధవ
హింపనట్టిపురుషు లెల్లయపుడు
నన్నుఁజెందలేక నడతురు సంసార
దుఃఖమయము లైన త్రోవలందు.

04. తే. ఇంద్రియాగోచరుఁడ నౌచు నీజగంబు
నెల్ల వ్యాపించియుందు నేనింద్రతనయ!
అఖిలభూతంబులకు నేనె యాశ్రయంబు;
వానిమీఁదఁ నే నాధారపడుటలేదు.

05. తే. అట్లనుట, వాని వహియింతునని తలఁపకు;
ఈశ్వరుఁడ నగునాయోగమీవు గనుము;
వాని భరియింతు; వానితోడ్పాటు గనను;
కలుగు సర్వంబు నాదుసంకల్పముననె.

(9) శ్లో॥ 6 : యథాకాశస్థితో నిత్యం
వాయుః సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని
మత్స్థానీత్యుపధారయ ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 7 : సర్వభూతాని కౌంతేయ
ప్రకృతిం యాంతి మామికామ్।
కల్పక్షయే పునస్తాని
కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 8 : ప్రకృతిం స్వామవష్టభ్య
విసృజామి పునః పునః ।
భూతగ్రామమిమం కృత్స్నమ్
అవశం ప్రకృతేర్వశాత్ ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 9 : న చ మాం తాని కర్మాణి
నిబధ్నంతి ధనంజయ! ।
ఉదాసీనవదాసీనమ్
అసక్తం తేషు కర్మసు ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 10 : మయాధ్యక్షేణ ప్రకృతిః
సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ!
జగద్విపరివర్తతే ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 11 : అవజానంతి మాం మూఢా
మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానంతో
మమ భూతమహేశ్వరమ్ ॥ (పరమాత్మ, సాకారము)

06. తే. వాయు వేరీతి శూన్యనభంబునందు
సంచరించును నిల్చు నా శక్తివలన,
అట్లె నను సర్వభూతంబులాశ్రయించు;
అన్నిటికి నేన యాధారమగుదు సుమ్మి.

07. తే. ప్రళయకాలంబునందు నా ప్రకృతియందె
భూతజాలము లీనంబు పొందుచుండు;
వానినెల్లను మరలఁ గల్పాదియందు
నేన సృజియించు చుండెద నిర్మలాత్మ !

08. తే. నాడు ప్రకృతికిఁ దా మధీనములు గాన
భూతముల కస్వతంత్రత పొడమియుండు;
మరలమరలను బుడమి జన్మము లొసంగి
వాని సృజియించు చుందు నాప్రకృతిఁబూని.

09. ఆ. అట్టికర్మముల ననాసక్తి వహియించి
నేఁ దటస్థుడనుగ నిలిచియుందు;
కనుక నాకు బంధకములు గాఁజాలవు
జగతియొక్క ప్రళయ సంభవములు.

10. ఆ. అవని నేను బ్రకృతికధ్యక్షత వహింప
జగతిఁ గలుగు భూతజాల మెల్ల;
నట్టిహేతువుననె యర్జునా! జగము చ
క్రంబుహోలెఁ దిరుగఁగలుగు నెపుడు.

11. తే. సర్వభూతంబులకు మహేశ్వరుఁడ నయ్యు
నరశరీరంబు ధరియించు నన్నుఁజూచి
నాదు శ్రేష్ఠత్వ మెఱుఁగని నరులు మూఢు
లగుచు న న్నవమానింతు రనఘచరిత !

(9) శ్లో॥ 12 : మోఘాశా మోఘకర్మాణో
మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ
ప్రకృతిం మోహినీం శ్రితాః । (జీవాత్మ, ప్రకృతి)

(9) శ్లో॥ 13 : మహాత్మానస్తు మాం పార్థ !
దైవీం ప్రకృతిమాశ్రితాః
భజంత్యనన్యమనసో
జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ ॥ (జీవాత్మ, పరమాత్మ)

(9) శ్లో॥ 14 : సతతం కీర్తయంతో మాం
యతంతశ్చ దృఢవ్రతాః ।
నమస్యంతశ్చ మాం భక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే ॥ (జీవుడు, పరమాత్మ)

(9) శ్లో॥ 15 : జ్ఞానయజ్ఞేన చాప్యన్యే
యజంతో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన
బహుధా విశ్వతోముఖమ్ ॥ (సాకారము, పరమాత్మ)

(9) శ్లో॥ 16 : అహం క్రతురహం యజ్ఞః
స్వధాహ మహమౌషధమ్ ।
మంత్రోహమహమేవాజ్యమ్
అహమగ్నిరహం హుతమ్॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 17 : పితాహమస్య జగతో
మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోంకార
ఋక్సామ యజురేవ చ ॥ (పరమాత్మ)

12. తే. రాక్షసం బాసురంబును భ్రాంతిజన్య
మైనప్రకృతిస్వభావంబు నాశ్రయించు
మూఢులకుఁ గల్గు మోఘాశ మోఘకర్మ
ములప్రసక్తి మోఘజ్ఞానమును గిరీటి!

13. తే. దైవసంబంధ మైనసత్త్వప్రకృతిని
నమ్మి చేరుమహాత్ములనన్యమాన
సమున భజియింత్రు నన్ను భూతములమూల
కారణుని గాఁగ నవ్యయుఁ గాఁగదెలిసి.

14. తే. సతతసంకీర్తనంబులు సల్పువారు
దృఢమనస్సుతోడను బ్రయత్నించువారు
చెలఁగి భక్తి నమస్కృతుల్సేయువారు
నిత్యయుక్తు లుపాసింత్రు నియతి నన్నె.

15. తే. విశ్వమెల్లను వ్యాపించి వివిధరూప
ములఁ జరించెడిన న్నేకముగ నెఱింగి
జ్ఞానయజ్ఞంబుచే నుపా సనలఁ జేసి
యోగ మొనరింత్రు మఱికొంద ఱుర్విజనులు.

16. తే. నేనక్రతువును, యజ్ఞంబు నేన యగుదు,
నేన స్వధయును, నౌషధంబేన, మఱియు
నేన మంత్రంబు, నాజ్యంబునేన, యగ్ని
నేన, హెూమంబు సహితమునేన, పార్థ!

17. తే. అఖిలజగతికిఁ దలిదండ్రు లగుదు నేన;
ధాత నే నౌదు; మఱియును తాత నగుదుఁ;
బరమవేదస్వరూప మౌ ప్రణవ మేన;
ఋగ్యజుస్సామములలోని ఋక్కు లేన.

(9) శ్లో॥ 18 : గతిర్భర్తా ప్రభుః సాక్షీ
నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం
నిధానం బీజమవ్యయమ్ ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 19 : తపామ్యహమహం వర్షం
నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ
సదసచ్చాహమర్జున ! ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 20 : త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥ (జీవాత్మ,పరమాత్మ)

(9) శ్లో॥ 21 : తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే ॥ (జీవాత్మ,పరమాత్మ)

(9) శ్లో॥ 22 : అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥ (జీవాత్మ,పరమాత్మ)

(9) శ్లో॥ 23 : యేప్యన్యదేవతాభక్తా
యజంతే శ్రద్ధయాన్వితాః ।
తేపి మామేవ కౌంతేయ!
యజంత్యవిధిపూర్వకమ్ ॥ (జీవాత్మ,పరమాత్మ)

18. ఆ. గతియుఁ బ్రభువు సాక్షి పతి సుహృజ్జనుఁడు ని
వాసశరణములును బ్రభవలయము
లైనస్థానములు నిధానంబు బీజంబు
నవ్యయంబు సకల మగుదు నేన.

19. తే. నేన తపియింపఁ జేయుదు, నేన వర్ష
జలములను స్వీకరించి, మరల విడుతును;
మృత్యువును నేన, మఱియు నమృతము నేన;
సత్తుగా నుందు నేన, యసత్తు నేన.

20. తే. యాజ్ఞికులు సోమపానులు నఘవిముక్తు
లగుచు నాదయచే స్వర్గ మందఁగలిగి
యతులపుణ్యజన్యములు దివ్యములు నైన
భోగముల దివ్యసుఖములఁ బొందుచుంద్రు.

21. ఆ. అచట స్వర్గసుఖములనుభవించినయంత
మర్త్యలోకమునకు మరలుచుంద్రు;
అట్లు కామపరుల కగుఁ, ద్రయీధర్మంబు
లం దశాశ్వతంబు లగుసుఖములు.

22. ఆ. అన్యచింతలేక యనవరతము నన్ను
పాసనంబు సేసి భక్తి సలుపు
నట్టి నిత్యయుక్తులగువారికి క్షేమంబు
యోగమును వహించుచుందు నేన.

23. ఆ. అట్లు గాక యెవ్వఁ డన్యదేవతల నా
రాధనం బొనర్చు శ్రద్ధ గలిగి,
యతఁడుగూడ నన్నెయారాధనము సేయు
వాఁడు సుమ్మి యవిధి పథముఁజొచ్చి.

(9) శ్లో॥ 24 : అహం హి సర్వయజ్ఞానాం
భోక్తా చ ప్రభురేవ చ ।
న తు మామభిజానంతి
తత్త్వేనాతశ్చ్యవంతి తే ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 25 : యాంతి దేవవ్రతా దేవాన్
పితౄన్ యాంతి పితృవ్రతాః।
భూతాని యాంతి భూతేజ్యా
యాంతి మద్యాజినోపి మామ్ ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 26 : పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహ ః భక్త్యుపహృతమ్
అశ్నామి ప్రయతాత్మనః ॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 27 : యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపస్యసి కౌంతేయ !
తత్ కురుష్వ మదర్పణమ్ ॥ (పరమాత్మ, కర్మయోగము)

(9) శ్లో॥ 28 : శుభాశుభఫలైరేవం
మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా
విముక్తో మాముపైష్యసి ॥ (పరమాత్మ, కర్మయోగము)

(9) శ్లో॥ 29 : సమోహం సర్వభూతేషు
న మే ద్వేష్యోస్తిన ప్రియః ।
యే భజంతి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్॥ (పరమాత్మ)

24. ఆ. సర్వదేవతలకు సల్పుయజ్ఞములందు
భోక్త నేన, మఱి ప్రభువును నేన;
నను యథార్థరీతిఁ గననివారల కెల్ల
సుఖము గలిగి పిదపఁ జ్యుతియుఁ గలుగు.

25. తే. దేవతాపూజ పొందించు దేవతలనె;
పితరుల భజింపఁ జేర నౌఁ బితరులందె;
భూతపూజచే నగుఁ జెంద భూతములనె;
నన్నుఁ బూజింపఁ జేర నౌ నన్నె పార్థ!

26. కం. ఫల మైనఁ బుష్పమైనను
జల మైనను బత్రమైన సద్భక్తిని ని
ర్మలబుద్ధి నా కొసంగ, మి
గుల స్వల్పం బైన, దానిఁ గూర్మి భుజింతున్.

27. ఆ. దేనిఁ జేయుచుంటి దేనిని దినుచుంటి
దేని వ్రేల్చుచుంటి దేని నొసఁగు
చుంటి తపము సేయుచుంటి వెద్దానిని,
అర్పణం బొనర్పు మన్ని నాకె.

28. తే. అటులు, మానససంన్యాసమనెడుయోగ
మునఁ దొలంగు శుభాశుభము లగు కర్మ
ఫలములును వానిబంధనములును, బార్థ !
చేరుదువు నన్నుఁ బిదప నవారితముగ.

29. ఆ. సముఁడ నగుదు నేనుసర్వభూతములకు;
ద్వేషి లేఁడు నాకుఁ బ్రియుఁడు లేఁడు;
ఎవరు భక్తిఁగొలుతు రిల నన్ను, నాయందు
వారు, మఱియు నేను వారియందు.

(9) శ్లో॥ 30 : అపి చేత్ సుదురాచారో
భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః
సమ్యగ్వ్యవసితో హి సః ॥ (జీవుడు, పరమాత్మ)

(9) శ్లో॥ 31 : క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి ॥ (జీవుడు, పరమాత్మ)

(9) శ్లో॥ 32 : మాం హి పార్థ! వ్యపాశ్రిత్య
యేపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథాశూద్రాః
తేపి యాంతి పరాం గతిమ్॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 33 : కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా
భక్తా రాజర్షయస్తథా ।
అనిత్యమసుఖం లోకమ్
ఇమం ప్రాప్య భజస్వమామ్॥ (పరమాత్మ)

(9) శ్లో॥ 34 : మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమ్
ఆత్మానం మత్పరాయణః ॥ (సాకారము, నిరాకారము)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**

**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**

**రాజవిద్యా రాజగుహ్యయోగోనామ**

**నవమోధ్యాయః**

30. తే. ఇల దురాచారసంపన్నుఁ డేని, యన్య
చింత లేకుండ నన్నుఁ బూజించువాని
సాధు వని యెంచవలయును సవ్యసాచి!
వాఁడు లెస్సగా నిశ్చయ పరుఁడు గనుక.

31. తే. అట్టివాఁడు ధర్మాత్ముఁడై యనతికాల
ముననె శాశ్వత శాంతిని గనఁగలుగును;
నాదుభక్తుని కెన్నఁడు నాశనంబు
కలుగనేరదు; ప్రతినగాఁ దలఁపు దీని.

32. ఆ. పాపయోనిసంభవం బందియును స్త్రీలు
వైశ్యశూద్రజనులు వడయుచుంద్రు
పరమపదము, నన్నుపాసనం బొనరించి
నాయనుగ్రహమున నయచరిత్ర!

33. ఆ. కనుక, మంచి పుట్టుగల బ్రాహ్మణుల రాజ
ఋషుల వేఱ చెప్పనేల? పార్థ!
నీ వసౌఖ్యదం బనిత్య మౌలోకమం
దున్న నేమి? భక్తినన్నుఁగనుము.

34. ఆ. నన్ను నీ దుదృఢ మనస్సున నిల్పుము;
నన్ను భక్తిఁ గనుము నను యజింపు;
నను నమస్కరింపు; నన్నాశ్రయింపుము;
పొందగలవు నన్నె పుణ్యచరిత!

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**తొమ్మిదవ అధ్యాయము రాజవిద్యా రాజగుహ్యాయోగము సమాప్తము.**

## అథ దశమోధ్యాయః - విభూతియోగః

శ్రీ భగవానువాచ :-

(10) శ్లో॥ 1 : భూయ ఏవ మహాబాహో!
శృణు మేం పరమం వచః ।
యత్తేహం ప్రీయమాణాయ
వక్ష్యామి హితకామ్యయా॥ (జ్ఞానము)

(10) శ్లో॥ 2 : న మే విదుః సురగణాః
ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం
మహర్షీణాం చ సర్వశః ॥ (సాకారము)

(10) శ్లో॥ 3 : యో మామజమనాదించ
వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢః స మర్త్యేషు
సర్వపాపైః ప్రముచ్యతే ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 4 : బుద్ధిః జ్ఞానమసమ్మోహః
క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భవోభావో
భయం చాభయమేవ చ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 5 : అహింసా సమతా తుష్టిః
తపో దానం యశోయశః ।
భవంతి భావా భూతానం
మత్త ఏవ పృథగ్విధాః ॥ (పరమాత్మ)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మద్భగవద్గీత

దశమాధ్యాయము

## విభూతి యోగము

శ్రీ భగవంతుడిట్లనియె :-

01. ఆ. ప్రీతి నింతవఱకు విన సంతసించిన
విషయములను మఱియు విశదపరుప
నీదుహితము గోరి నేనింక నొకమాటు
శ్రేష్ఠవచనముల వచింతు వినుము.

02. ఆ. వరబుషీశ్వరులును  సురగణంబులను నా
యద్భుతప్రభావ  మరయఁగలరె?
అమరులకును బుషులకాదిభూతుఁడ; వారి
కేన శక్తు లెల్ల నిచ్చువాఁడ.

03. తే. అఖిలలోకేశ్వరుండ నంచజుఁడ ననుచు
ఆదిరహితుండ నంచు నన్నరయువాని
మౌఢ్యమెల్లను నశియించుమఱియు సర్వ
పాపములనుండి విడివడు; భవ్యచరిత!

04. తే. బుద్ధి జ్ఞాన మసమ్మోహమును క్షమయును
సత్యనిరతత్వమును దమశ్శమగుణములు
సౌఖ్యదుఃఖముల్ భవమును సంకటంబు
భయముఁ జెందుచుంటయును నిర్భయము మఱియు.

05. తే. తుష్టియును నహింసయు సమదృష్టి తపము
నీవి యశమును మఱి యశోహీనతయును
భూతములు పొందు బహుగుణంబులును మహిని
గలుగుచుండును నాదుసంకల్పముననె.

(10) శ్లో॥ 6 : మహర్షయః సప్త పూర్వే
చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా
యేషాం లోక ఇమాః ప్రజాః॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 7 : ఏతాం విభూతిం యోగం చ
మమ యో వేత్తి తత్త్వతః।
సోవికంపేన యోగేన
యుజ్యతే నాత్ర సంశయః ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 8 : అహం సర్వస్య ప్రభవో
మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం
బుధా భావసమన్వితాః ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 9 : మచ్చిత్తా మద్గతప్రాణాః
బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం
తుష్యంతి చ రమంతి చ ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 10 : తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం
యేన మాముపయాంతి తే ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 11 : తేషామేవానుకంపార్థమ్
అహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో
జ్ఞానదీపేన భాస్వతా ॥ (పరమాత్మ)

06. తే. భువనమండలిజను లెల్లఁ బుట్టి రెవరి
సంతతిగ, నట్టివారలౌ సప్తఋషులు
మనుచతుష్టయమును నాదు మనసునందె
జనన మొంది మద్భావముల్ సలుపుచుంద్రు.

07. ఆ. ఉర్వి నావిభూతి యోగంబు నెవఁడు ని
శ్చయ విధమున నెఱుఁగఁ జాలు, వాఁడు
నిశ్చలముగ మనసు నిల్పుయోగంబును
బొందు; దీనలేదు సందియంబు.

08. తే. అఖిలజగతికిఁ బ్రభవ మేనగుదు ననుచు
నిల సమస్తంబుఁ జెలఁగు నా వలన ననుచు
నెఱుఁగమద్భావయుతు లైన పరమబుధులు
నన్నె భజియించుచుందు రనారతంబు.

09. తే. చిత్తమును బ్రాణములు ననుఁజేరఁ జేసి
నన్నుఁ దెలిపెడునాలీల లెన్నుకొనుచు
నొకరి కొక్కరు భాషించు చుంట, నిత్య
పరవశులు గాఁగ నుంద్రు నా భక్తవరులు.

10. తే. సతతయుక్తత నన్ను భజన మొనర్చు
భక్తివరుల కవశ్యంబు పరఁగ నిత్తు
బుద్ధియోగంబు నేఁబ్రీతి పూర్వకముగ;
వారు దానిఁ గైకొని నన్నుఁ జేరఁగలరు.

11 . ఆ. అట్లు నాయనుగ్ర హమునకుఁ బాత్రులౌ
వారి హృదయపీఠిఁ జేరి నేను
జ్ఞానదీపమును బ్రకాశింపఁ జేయుచుఁ
దమమునెల్ల వెలికిఁ దఱిమివైతు.

అర్జున ఉవాచ :-

(10) శ్లో॥ 12 : పరం బ్రహ్మ పరం ధామ
పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్యమ్
ఆదిదేవమజం విభుమ్ ॥

(10) శ్లో॥ 13 : ఆహుస్త్వామ్ ఋషయః సర్వే
దేవర్షిర్నారదస్తథా ।
అసితో దేవలో వ్యాసః
స్వయం చైవ బ్రవీషిమే ॥

(10) శ్లో॥ 14 : సర్వమేతదృతం మన్యే
యన్మాం వదసి కేశవ! ।
న హి తే భగవన్ వ్యక్తిం
విదుర్దేవా న దానవాః ॥

(10) శ్లో॥ 15 : స్వయమేవాత్మనాత్మానం
వేత్థ త్వం పురుషోత్తమ! ।
భూతభావన! భూతేశ!
దేవదేవ! జగత్పతే! ॥

(10) శ్లో॥ 16 : వక్తుమర్హస్యశేషేణ
దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభిర్విభూతిభిర్లోకాన్
ఇమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

(10) శ్లో॥ 17 : కథం విద్యామహం యోగిన్
త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు
చింత్యోసి భగవన్ మయా ॥

అర్జునుడిట్లనియె :-

12. తే. పరమధాముఁడవును బర బ్రహ్మవును బ
విత్రుఁడవు శ్రేష్ఠుఁడవు నీవు విశ్వరూప !
దివ్యుఁడవు శాశ్వతుఁడ వాది దేవుఁడవును
బురుషుఁడవు విభుఁడ వజుండ వరయ నీవ.

13. తే. అనుచు నారదుఁ డాదిగా నఖిలఋషులు
నసితుఁడును దేవలుండును వ్యాసమౌని
యును వచింపఁగఁ బలుమాఱు వినుటగాక
విశదముగ నీవ చెప్పఁగా వింటిఁ గాదె?

14. కం. ఎది నాకుఁ జెప్పితో నీ,
వది యెల్లను నిశ్చయంబెయగు; నీ విషయం
బిది దేవదానవులకును
విదితము కాఁగలదె? నీవు వినిపింపనిచోన్,

15. ఆ. నిన్ను నీవ తెలియనేర్తువు నీ జ్ఞాన
మునసె, దేవదేవ! దనుజవైరి!
భూతభావనుఁడవు పురుషోత్తముఁడవు భూ
తేశుఁడవు జగత్పతివియు నీవ.

16. తే. ఏ విభూతల వ్యాపింతువెల్ల లోక
ములను, వానిని నిశ్శేషముగ వచింపు;
నీ నియమనవిశేషముల్ నీవ చెప్ప
వలయుఁ గావి, మనుష్యుల వలన నగునె?

17. తే. చిత్తమున నిన్ను సర్వదా చింత సేసి
యోగి నై నినుఁ గనుభాగ్యమొందు టెట్లు?
మఱియు నేభావముల నిన్ను మదిఁ దలంప
వచ్చునో, యవి దెల్పవే వనరుహాక్ష!

(10) శ్లో॥ 18 : విస్తరేణాత్మనో యోగం
విభూతిం చ జనార్ధన! ।
భూయః కథయ తృప్తిర్హి
శృణ్వతో నాస్తిమేమృతమ్ ॥

శ్రీ భగవానువాచ :-

(10) శ్లో॥ 19 : హంత తే కథయిష్యామి
దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ!
నాస్త్యంతో విస్తరస్య మే ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 20 : అహమాత్మా గుడాకేశ!
సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ
భూతానామంత ఏవ చ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 21 : ఆదిత్యానామహం విష్ణుః
జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి
నక్షత్రాణామహం శశీ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 22 : వేదానాం సామవేదోస్మి
దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి
భూతానామస్మి చేతనా ॥ (పరమాత్మ మహత్యములు)

18. ఆ. నీదుయోగమహిమ నీవిభూతివిశేష
ముల వచింపు మరల జలజనయన !
ఈ మహామృతంబు నెన్నిసారులు విన్నc
దృప్తి లేదు నాకు దేవదేవ !

శ్రీ భగవంతుడిట్లనియె :-

19. ఆ. అకట ! నావిభూతులంత్యంబు లేనట్టి
వగుట విస్తరింప వలను గాదు;
వానియందు ముఖ్యమైనవానిని శుభం
బైనవాని విశద పఱతు వినుము.

20. తే. అన్ని భూతాశయంబుల కాత్మ నగుచు
వాని కాధారముగ నుండు వాcడ నేన;
అవని సృష్టిని స్థితిని నంత్యమును గూడ
భూతజాలంబు నా చేతc బొందుచుండు.

21. తే. సూర్యులందఱలోన విష్ణువును నేన;
జ్యోతులం దెల్ల దినకరజ్యోతి నేన;
వాయువులలో మరీచి యన్వాయు వేన?
ఉడుగుణంబులలోనc జంద్రుండను నేన.

22. తే. వేదముల శ్రేష్ఠ మౌసామవేద మేన;
వాసవుండను నేనదేవతలయందు;
ఇంద్రియములందు మానసంబేన; మఱియు
భూతముల కెల్ల నేc జుమీ చేతనంబు

(10) శ్లో॥ 23 : రుద్రాణాం శంకరశ్చాస్మి
విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి
మేరుః శిఖరిణామహమ్ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 24 : పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి పార్థ ! బృహస్పతిమ్।
సేనానీనామహం స్కందః
సరసామస్మి సాగరః ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 25 : మహర్షీణాం భృగురహం
గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జ్ఞానయజ్ఞోస్మి
స్థావరాణాం హిమాలయః ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 26 : అశ్వత్థః సర్వవృక్షాణాం
దేవర్షీణాం చ నారదః ।
గంధర్వాణాం చిత్రరథః
సిద్ధానాం కపిలో మునిః ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 27 : ఉచ్చైః శ్రవసమాశ్వానాం
విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతం గజేంద్రాణాం
నరాణాం చ నరాధిపమ్ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 28 : ఆయుధానామహం వజ్రం
ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః
సర్పాణామస్మి వాసుకిః ॥ (పరమాత్మ మహత్యములు)

23. తే. రుద్రులం దెల్ల నే శంకరుండ నగుదు;
యక్షరక్షసులందలకాధిపతిని;
పావకుండను నే సర్వ వసువులందు;
శిఖరధరములలో మేరుశిఖరి నేన.

24. తే. అలపురోహితులందు బృహస్పతియును
నేన యగుదును; మఱియును మాననీయ!
సర్వసేనానులందు నే షణ్ముఖుండ;
సరసులం దెల్ల నే సుమీ సాగరుఁడను.

25. తే. భృగుమహర్షిని ఋషులలో నగుదు నేను;
శబ్దములలోన నోంకారశబ్ద మేన;
యజ్ఞములయందు జ్ఞాన యజ్ఞ మగుదు;
అద్రులందు హిమాలయ మగుదు నేను.

26. తే. సర్వవృక్షంబులందు నశ్వత్థ మేన;
పార్థ ! నే నారదుఁడను దేవర్షులందు;
చిత్రరథుఁడను గంధర్వ సేనలందు;
కపిలముని నేన సిద్ధులౌ జ్ఞానులందు.

27. తే. అశ్వములయందు నేన యుచ్చైశ్రవంబ
నగుదు నమృతముతోఁబుట్టినందువలన;
అగుదు నై రావతంబ నే నుఁగులయందు;
మనుజులందు నే నౌదును మనుజపతిని.

28. తే. ఆయుధంబుల వజ్రంబనగుదు నేను;
ధేనువులయందు నేఁ గామధేను వగుదు;
జననకారకులందు నే స్మరుఁడ నగుదు;
వాసుకిని నేనయగుదు సర్పములయందు.

(10) శ్లో॥ 29 : అనంతశ్చాస్మి నాగానాం
వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి
యమః సంయమతామహమ్॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 30 : ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం
కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేంద్రోహం
వైనతేయశ్చ పక్షిణామ్ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 31 : పవనః పవతామస్మి
రామః శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి
స్రోతసామస్మి జాహ్నవీ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 32 : సర్గాణామాదిరంతశ్చ
మధ్యం చైవాహమర్జున! ।
అధ్యాత్మవిద్యా విద్యానాం
వాదః ప్రవదతామహమ్ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 33 : అక్షరాణామకారోస్మి
ద్వంద్వః సామాసికస్య చ ।
అహమేవాక్షయః కాలో
ధాతాహం విశ్వతోముఖః ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 34 : మృత్యుః సర్వహరశ్చాహమ్
ఉద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం
స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ (పరమాత్మ మహత్యములు)

29. తే. నాగముల వేయిశిరసుల భోగి నగుదు;
వనధి నివసించువారిలో వరుణుఁ డగుదు;
అర్యముఁడ నౌదుఁ బితరుల యందు నేను;
దండనాధికారులలో యముండ నేను.

30. తే. అమరవైరులయందుఁ బ్రహ్లాదుఁ డగుదు;
కాలుఁడను నేన భువినున్న కలయతులకు
మృగపతిని నేన సుమి యెల్ల మృగములందు;
వైనతేయుండ నగుదు నేఁ బక్షులందు.

31. తే. గమనవంతులయందు నే గాలి నగుదు;
శస్త్రపాణులలో రామ చంద్రుఁ డగుదు;
మత్స్యజాలంబులను నేను మకర మగుదు;
జాహ్నవిని నేన సుమి పుణ్య జలములందు.

32. తే. ఇల జనించెడు భూతకోటులకు నెల్ల
నాదిమధ్యలయంబులు నగుదు నేన;
విద్యలందును నధ్యాత్మవిద్య నేను;
వాద మొనరించువారల వాద మేను.

33. తే. అక్షరములం దకారంబ నగుదు నేన
వరసమాసంబులందు ద్వంద్వంబు నేన
అక్షయం బగుకాలంబు నగుదు నేన;
విశ్వతోముఖుఁ డగునట్టి విధిని నేన.

34. తే. ఎల్లవానిని హరియించు మృత్యు వగుదు;
పుట్టఁబోయెడువారికిఁ బుట్టు కగుదు;
స్త్రీలలో లక్ష్మి నేను; గీర్తియును స్మృతియు
వాగ్ధృతులు మేధయును క్షమాపణయు నేన.

(10) శ్లో॥ 35 : బృహత్సామ తథా సామ్నాం
గాయత్రీ ఛందసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోహమ్
ఋతూనాం కుసుమాకరః ॥(పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 36 : ద్యూతం ఛలయతామస్మి
తేజస్తేజస్వినామహమ్ ।
జయోస్మి వ్యవసాయోస్మి
సత్త్వం సత్త్వవతామహమ్ ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 37 : వృష్ణీనాం వాసుదేవోస్మి
పాండవానాం ధనంజయః ।
మునీనామప్యహం వ్యాసః
కవీనాముశనా కవిః ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 38 : దండో దమయతామస్మి
నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం
జ్ఞానం జ్ఞానవతామహమ్॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 39 : యచ్చాపి సర్వభూతానాం
బీజం తదహమర్జున! ।
న తదస్తి వినా యత్ స్యాత్
మయా భూతం చరాచరమ్॥ (పరమాత్మ మహత్యములు)

35. తే. సామగానంబులను బృహత్సామ మేన;
అఖిలఛందబులందు గాయత్రి నేన;
మార్గశిరమాసమును నేన మాసములను
ఋతువు లన్నిటను వసంతఋతువు నేన.

36. తే. వంచకుల కెల్ల నే ద్యూత వంచనమును;
సర్వతేజస్యులందుఁదే జంబు నేన;
సాత్త్వికులయందు విలసిల్లు సత్త్వ మేన;
జయమగుదు నేన; మఱి వ్యవ సాయ మేన.

37. తే. వాసుదేవుండ యాదవ వంశమందు;
అర్జునుండను నేఁ బాండవాన్వయమున;
వ్యాసుఁడను నేన యెల్ల సంయములయందు;
కవిజనంబులలో శుక్రకవిని నేన.

38. తే. దండనము సేయువారి దౌదండమేన;
దిగ్విజయులకు రాజనీతియును నేన;
గోపనము లన్నిటను మౌనగుణము నేన;
జ్ఞానవంతులపాలిటి జ్ఞానమేన.

39. తే. సర్వభూతంబులకును బీజంబు నేను
గాన, తజ్జన్మములకే నఁ గారణమను;
నేను లేనట్టి భూత మేదేని లేదు;
జగతిలోపలఁ గల చరాచరములందు.

(10) శ్లో॥ 40 : నాంతోస్మిమమ దివ్యానాం
విభూతీనాం పరంతప! ।
ఏష తూద్దేశతః ప్రోక్తో
విభూతేర్విస్తరో మయా ॥ (పరమాత్మ మహత్యములు)

(10) శ్లో॥ 41 : యద్యద్విభూతిమత్ సత్త్వం
శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం
మమ తేజోంశసంభవమ్ ॥ (పరమాత్మ)

(10) శ్లో॥ 42 : అథవా బహునైతేన
కిం జ్ఞాతేన తవార్జున! ।
విష్ట భ్యాహమిదం కృత్స్నమ్
ఏకాంశేన స్థితో జగత్ ॥ (పరమాత్మ)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**విభూతియోగోనామ దశమోధ్యాయ**



40. తే. అంతమున్నదె? కల్యాణ వంతము లగు
నావిభూతుల వర్ణింప నమ్రచరిత!
విస్తరింపక నేను జెప్పితిని నీకు
ముఖ్యమైనవి సంగ్రహముగను నేఁడు.

41. ఆ. భూతజాలమున విభూతిమంతంబును
గాంతికరమును శుభకార్యకరము
నేది గలదొ యట్టి దెల్లను నా తేజ
సంభవంబు; నిజము; సవ్యసాచి!

42. ఆ. ఇట్లు గానియెడల నేమిప్రయోజనం
బేను నీకు దీని నెఱుఁగఁ జెప్పి
మహితజగము నాదు మహిమమం దణుమాత్ర
మునసె నిల్చుచుండునని యెఱుంగు.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**పదియవ అధ్యాయము విభూతియోగము సమాప్తము.**



## అథ ఏకాదశోధ్యాయః - విశ్వరూపసందర్శన యోగః

అర్జున ఉవాచ :-

(11) శ్లో॥ 1 : మదనుగ్రహాయ పరమం
గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన
మోహోయం విగతో మమ ॥ (ధర్మములు)

(11) శ్లో॥ 2 : భవాప్యయౌ హి భూతానాం
శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష !
మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥ (పరమాత్మ)

(11) శ్లో॥ 3 : ఏవమేతద్యథాత్థ త్వమ్
ఆత్మానం పరమేశ్వర! ।
ద్రష్టుమిచ్ఛామి తే రూపమ్
ఐశ్వరం పురుషోత్తమ ! ॥ (పరమాత్మ, నిరాకారము)

(11) శ్లో॥ 4 : మన్యసే యది తచ్ఛక్యం
మయా ద్రష్టుమితి ప్రభో! ।
యోగేశ్వర తతో మే త్వం
దర్శయాత్మానమవ్యయమ్ ॥ (పరమాత్మ, నిరాకారము)

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

## శ్రీ మద్భగవద్గీత

ఏకాదశాధ్యాయము.

## విశ్వరూపసందర్శన యోగము

అర్జునుడిట్లనియె :-

01. ఆ. నన్ననుగ్రహింప నా కింతదనుక నీ
వెఱుఁగఁజెప్పినట్టి పరమగుహ్య
మైనశాస్త్రవచన మధ్యాత్మ విషయంబు
గాన మోహ మెల్ల మానఁ జేసె.

02. ఆ. సర్వభూతములకు సంభవప్రళయము
లీవె చేతు వనుచు, నీదుమహిమ
మవ్యయం బటంచు నరవిందలోచనా!
వింటి నీవె చెప్ప విస్తరముగ.

03. ఆ. నిన్నుఁ గూర్చి యిపుడు నీవచించినదెల్ల
సర్వలోకనాథ ! సత్యమ యగు;
ఇచ్ఛ వొడమె నీదు నీశ్వరరూపంబు
కన్నులారఁ గాంచఁ గమలనాభ !

04. తే. సర్వలోకేశ! యారూప మూర్వియందు
నేను గనుఁగొనఁగాఁ దగు నేని నాకుఁ
జూపు మయ్యది నీనిజరూప మగుట
నవ్యయంబును నాశ్చర్యమగును గాదె?

శ్రీ భగవానువాచ :-

(11) శ్లో॥ 5 : పశ్య మే పార్థ! రూపాణి
శతశోథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని
నానావర్ణాకృతీని చ ॥ (పరమాత్మ, నిరాకారము)

(11) శ్లో॥ 6 : పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్
అశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్టపూర్వాణి
పశ్యాశ్చర్యాణి భారత ! ॥ (పరమాత్మ, నిరాకారము)

(11) శ్లో॥ 7 : ఇహైకస్థం జగత్ కృత్స్నం
పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ !
యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి ॥ (పరమాత్మ, నిరాకారము)

(11) శ్లో॥ 8 : న తు మాం శక్యసే ద్రష్టుమ్
అనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః
పశ్య మే యోగమైశ్వరమ్ ॥ (పరమాత్మ, నిరాకారము)

అర్జున ఉవాచ :-

(11) శ్లో॥ 15 : పశ్యామి దేవాంస్తవ దేవ! దేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థమ్
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥ (నిరాకారము)

శ్రీ భగవంతుడిట్లనియె :-

05. ఆ. శతసహస్రరూప వితతి యౌనాస్వరూ
పంబుc జూపువాcడc బార్థ ! కనుము;
దివ్యకాంతియుతము దేదీప్యమానంబు
సకలవర్ణజాల సంయుతంబు

06. తే. వసువు లెనమండ్ర ద్వాదశ భాస్కరులను
పదునొకండు రుద్రుల నశ్వి వైద్యవరుల
నలువదియును దొమ్మిదిమరుత్తులను మఱియు
ముందు చూడనియాశ్చర్యములను గనుము.

07. తే. సర్వజగతియందులి చరాచరసమూహ
ముల ననేకంబు నేకస్థములుగ నాదు
దేహమం దున్నవానిcగాc దెలియగలవు;
కనుము సంపూర్ణముగ నీకుc దనివి దీర.

08. తే. అనఘ ! నాయీశ్వరత్వంబు గనుcగొనంగ
బ్రాకృతము లగునీకనుల్ పనికిరావు;
కనుక నీకిత్తు నాయను గ్రహమువలన
దివ్యదృష్టిని, దానిచేc దెలిసికొనుము.

అర్జునుడిట్లనియె :-

15. తే. దేవదేవ! చూచితిని నీ దేహమందు
సర్వదేవతలను భూత సంఘములను,
నలువదేవునిc గమలాసనస్థు, రుద్రు,
సర్వఋషివర్యులను, దివ్యసర్పములను.

(11) శ్లో॥ 16 : అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోనంతరూపమ్ ।
నాంతం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప! ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 18 : త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 19 : అనాదిమధ్యాంతమనంతవీర్యమ్
అనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్ ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 20 : ద్యావాపృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్! ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 21 : అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 22 : రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।
గంధర్వయక్షాసురసిద్ధసంఘా ః
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥ (నిరాకారము)

16. తే. ఆదిమధ్యాంతరహింతుడవై సహస్ర
బాహువక్త్రనేత్రంబులఁ బరంగుచుండు
నీయనంతరూపంబు నా నేత్రములకు
గోచరం బాయెఁ గృష్ణ ! నీకూర్మివలన!

18. తే. సర్వవేదముల ల్దెలువున క్షరమ వీవ;
అఖిలజగముల కాధారమగుదు వీవ;
శాశ్వతుండవు ధర్మసం స్థాపకుఁడవు;
మూలకర్తవు పురుషోత్తముఁడవు నీవ.

19. తే. ఆదిమధ్యాంత రహితుండవౌనసంత
బాహుఁడవు వీర్యుఁడవు శశి భాస్కరాక్షుఁ
డవు హుతాశనసమవక్త్రుఁడవు స్వతేజ
తప్త భువనుండ; వబ్బె నీ దర్శనంబు.

20. తే. మహికి నాకాశమునకును మధ్యమునకు
దిశలకెల్లను వ్యాప్తిఁ జెం దితివి నీవు;
అద్భుతము ఘోరమైన నీయాకృతిఁ గని
వ్యథలఁ జెందెడి లోకత్రయము మహాత్మ!

21. తే. అమరసంతతు ల్నీదేహమందుఁ జొచ్చి
భయముచేఁ గొంద అంజలి బద్ధులైరి
స్వస్తిఁ జెప్పిరి మునివరుల్సంతసమునఁ
జేయఁదొడఁగిరి స్తోత్రముల్సిద్ధు లెల్ల.

22. తే. కాంచుచున్నారు నిన్ను దిగ్భ్రమ వహించి
యక్షగంధర్వ సురసిద్ధులశ్వినులును
రుద్రులును సాధ్యులును భాస్కరులుఁ బితరులు
వసువులును మరుత్తు లును బావకులుఁ గూడి.

(11) శ్లో॥ 23 : రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్ ।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 24 : నభఃస్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 25 : దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 26 : అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః ।
భీష్మ ద్రోణః సూతపుత్రస్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 27 : వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని ।
కేచిద్విలాగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 28 : యథా నదీనాం బహవోంబువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి ।
తథా తవామీ నరలోకవీరాః
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ॥ (నిరాకారము)

23. తే. అఖిలజగములు గని భయం బందె ధారు
ణీశ ! గణనకు రానట్టి నీముఖములు
నేత్రములు బాహులూరువుల్నీపదములు
నీదు దంష్ట్రాకరాళ బహూదరములు.

24. ఆ. మింటి కెగయఁ బెరిఁగి మేలికాంతులవర్ణ
ములఁ జెలంగి వదనములను దెఱచు
నతివిశాలనేత్రుఁడగు నిన్నుఁ గనుటచే
ధృతియు శమముఁ దొలఁగె దేవదేవ!

25. తే. భూరిభీకరదంష్ట్రాళి ఘోరమగుచుఁ
బ్రళయకాలాగ్ని దీప్తిప్రభల వెలుంగు
వదనములఁ జూడ నాకు దిగ్భ్రమము గలిగె;
సుఖము నిడుమయ్య కరుణతోఁజూడుమయ్య.

26. తే. ధార్తరాష్ట్ర శతముఁ, దమకు సాయ మొనర్ప
వచ్చియున్న ధరణి పాలకులును,
ద్రోణభీష్మకర్ణ దుర్జ యానీకంబు,
మాకుఁ దోడు వచ్చు మనుజపతులు.

27. తే. క్రూరదంష్ట్రాళిఁ జెలఁగు నీ ఘోరవదన
జాలమందుఁ బ్రవేశింపఁ జనుట గంటి;
కోఱలకు మధ్యమునఁ దగుల్గొనినవారి
యుత్తమాంగంబు లాయెను దుత్తు నియలు.

28. తే. ఆబ్ధిలోపలఁ బడుటకై యతిరయమున
నెల్లతీర్థంబులును బ్రవహించురీతి
ఈమహాశూరు లెల్లరు నీముఖాగ్నిఁ
బడుటకొఱ కేఁగుచుంట గన్పడెడి దేవ!

(11) శ్లో॥ 29 : యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః
విశంతి నాశాయ సమృద్ధవేగాః ।
తథైవ నాశాయ విశంతి లోకా ః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగా ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 30 : లేలిహ్యాసే గ్రసమానః సమంతాత్
లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః ।
తేజోభిరాపూర్య జగత్ సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో! ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 31 : ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోస్తు తే దేవవర! ప్రసీద ।
విజ్ఞాతుమిచ్ఛా మి భవంతమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ (నిరాకారము)

శ్రీ భగవానువాచ :-

(11) శ్లో॥ 32 : కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః ।
ఋతేపి త్వాం నభవిష్యంతి సర్వే
యేవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ (పరమాత్మ)

(11) శ్లో॥ 33 : తస్మాత్ త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్! ॥ (పరమాత్మ)

29. ఆ. ప్రజ్వలించునగ్ని బహుపతంగంబులు
వడి వినాశమునకుఁ బడినయట్లు
నరసమూహములు వినాశంబునకు నీము
ఖాగ్నిఁ దఱియఁజొచ్చి రదిగొ దేవ!

30. ఆ. అఖిలజగతి జనుల నాస్వాదనము సేయు
చుంటి నీముఖాగ్ని మంటఁ గలియ;
నీకిరణములందె నిబిడీకృతంబుగా
భువనములు తపించి పోవుచుండె.

31. ఆ. ఎవఁడ వీవు దేవ! యీయుగ్రరూపం బ
దేల? యాదికర్త వీవు గావె?
నీప్రవృతి దెలుపు నీరజాక్షా! నమ
స్కారముల నొనర్తుఁ గరుణఁ గనుము.

శ్రీ భగవంతుడిట్లనియె :-

32. తే. కాలమును నేనెకనుక లోకమున కెల్ల
క్షయము గలిగింప వృద్ధియై సంచరింతు;
అరుల కెట్లేనిఁ గల్గు సంహార మిపుడు;
నీవు లేకున్న నీపని నిల్వఁబోదు.

33. తే. కనుక లెమ్మింక శత్రుమర్ధనముకొఱకు
జయము లభియించు, యశము రాజ్యంబు గల్గు
వార లింతకె నాచేతఁ బడిరి, నీవు
రణము సలుపు, నిమిత్తమాత్రముగఁ బార్థ!

(11) శ్లో॥ 34 : ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ (పరమాత్మ)

అర్జున ఉవాచ :-

(11) శ్లో॥ 36 : స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే
వమస్యంతి చ సిద్ధసంఘాః ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 37 : కస్మాచ్చ తేన నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోప్యాదికర్త్రే ।
అనంత! దేవేశ! జగన్నివాస!
త్వమక్షరం సదసత్ తత్పరం యత్ ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 38 : త్వమాదిదేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనంతరూప ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 39 : వాయుర్యమోగ్నిర్వరుణ శ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమస్తేస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోపి నమో నమస్తే ॥ (నిరాకారము)

34. తే. నిహతులుగఁ జేసి నే నట నిల్పియున్న
శంతనుసుతుండు ద్రోణుండు సైంధవుండు
సూతతనయుండు మొదలైన శూరవరుల
నని జయింపుము, యశము రాజ్యంబుఁ గొనుము.

అర్జునుడిట్లనియె :-

36. తే. జగము నీకీర్తి గని సంతసంబుఁ జెందె
భయము జనియించి రాక్షసుల్పరుగు లిడిరి
సిద్ధు లెల్లరు మ్రొక్కిరి చే మొగిడ్చి
లోకనాయక! యీరీతి నీకె తగును.

37. ఆ. పద్మగర్భుఁడేల ప్రణుతి సేయతయుండు
నతని కాదికర్తవైన నీకు;
అక్షరంబు సత్తునట్లె యసత్తు త
త్పరము నీవ యగుదు పరమపురుష.

38. ఆ. ఆదిదేవుఁడవును నఖిలలోకాధారుఁ
డవును మూలపురుషుడవును నీవె;
విశ్వమయుఁడ వీవె; వేత్తయు వేద్యుండ
వీవె; పరమపదము నీవె కృష్ణ!

39. ఆ. వాయు వగ్ని యముఁడు వరుణచంద్రులు బ్రహ్మ
బ్రహ్మతండ్రి వీవె పరమపురుష !
మ్రొక్కువాఁడ నీకు మ్రొక్కెద వేమాఱు
మ్రొక్కువాఁడ మఱియు మ్రొక్కువాఁడ.

(11) శ్లో॥ 40 : నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనంతవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోసి సర్వః ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 41 : సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి ।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ ప్రణయేన వాపి ॥ (సాకారము)

(11) శ్లో॥ 42 : యచ్చాపహాసార్థమసత్కృతోసి
విహారశయ్యాసనభోజనేషు ।
ఏకోథ వాప్యచ్యుత తత్సమక్షం
తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ ॥ (సాకారము)

(11) శ్లో॥ 43 : పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్ ।
న త్వత్సమోస్త్య భ్యధికః కుతోన్యో
లోకత్రయేప్యప్రతిమ ప్రభావ ॥ (సాకారము)

(11) శ్లో॥ 44 : తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్! ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 45 : అదృష్టపూర్వం హృషితోస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥ (సాకారము, నిరాకారము)

40. ఆ. మ్రొక్కువాఁడ ముందు మ్రొక్కువాఁడను వెన్క
మ్రొక్కువాఁడ సర్వదిక్కులందు;
అమితవిక్రముఁడ వనంతవీర్యుండవు;
జగతి కాత్మ వగుట జగతి వగుదు.

41. తే. సఖుఁడ వని యెంచి వినయంపు సరణి మాని
యిట్టి నీ మహ్యాత్సంబు నేనెఱుఁగ లేక
యోయి సఖ! యోయి మాధవ ! యోయి కృష్ణ!
యనుచుఁ బొరపడి యైన స్నేహమున నైన,

42. తే. శయ్యల విహారభోజన సమయములను
అందఱసమక్షమునను నేకాంతమునను
బరిహసించుచు విర్లక్ష్యభావమంది
పలికినది యెల్ల క్షమియింపవలయు దేవ!

43. ఆ. తండ్రి వగుదు వీవు ధరఁ జరాచరముల
కరయఁ బూజ్యుఁడవును గురుఁడ వగుదు;
త్రిభువనములయందు దేవేశ! నీ సముం
డుండఁ డన్న నధికుఁడుండునొక్కొ!

44. తే. కనుక జగదీశ! నీపాదకమలములకుఁ
బ్రణుతిఁ జేసెద న న్ననుగ్రహము సేయు;
సుతుల జనకుండు మఱియు స్నేహితుల సఖుఁడు
ప్రియను బ్రియుఁడునుబోలె సైరింపవలయు.

45. ఆ. ముందు గననిరూపమును జూడ సంతోష
మయ్యు స్వాంతమున భయంబు గలిగె;
తొలుతఁ గల్గురూపు తోయజేక్షణ ! చూపు
సుప్రసన్నుఁడ వయి సొంపు గూర్ప.

శ్రీ భగవానువాచ :-

(11) శ్లో॥ 47 : మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం
పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 48 : న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః
న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూపః శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర! ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 49 : మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృంగ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ (సాకారము,నిరాకారము)

అర్జున ఉవాచ :-

(11) శ్లో॥ 51 : దృష్ట్వేదం మానుషం రూపం
తవ సౌమ్యం జనార్దన! ।
ఇదానీమస్మి సంవృత్తః
సచేతాః ప్రకృతిం గతః ॥ (సాకారము)

శ్రీ భగవానువాచ :-

(11) శ్లో॥ 52 : సుదుర్దర్శమిదం రూపం
దృష్టవానసి యన్మమ ।
దేవా! అప్యస్య రూపస్య
నిత్య దర్శనకాంక్షిణః ॥ (నిరాకారము)

శ్రీ భగవంతుడిట్లనియె :-

47. తే. ఆద్యమును విశ్వమయము ననంతమైన
తేజమునఁ జెలఁగెడుదీనిఁ దెలియ రెవరుఁ;
గలిగె నీ కిది నాయనుగ్రహమువలన;
ధన్యుఁడవు నీవు పార్థ! యీ దర్శనమున.

48. ఆ. మహిని నీవుదక్క మఱియెవ్వరును దీనిఁ
గనినవారు లేరు ఘనగుణాఢ్య!
వివిధక్రియలవలన వేదాధ్యయనమున
దానములను నుగ్రతపము వలన.

49. తే. ఈభయంకరమౌ రూపమీవు చూచి
భయముఁ జెందకు మోహమన్వలను బడకు;
భీతి విడిపోవ నీకు సంప్రీతి గలుగఁ
జూవుచున్నాఁడ ముందటిరూపు మరల.

అర్జునుడిట్లనియె :-

51. తే. మనుజరూపంబు నీదుసౌమ్యస్వభావ
మైనయాకృతి గనుట, నాయంతరంగ
మందు స్వస్థత చేకూరె నంబుజాక్ష!
మానసంబున నిలుకడ మరలఁగల్గె.

శ్రీ భగవంతుడిట్లనియె :-

52. ఆ. పార్థ ! నీవు గనిన బ్రహ్మాండరూపంబు
పరులు గనుట దుర్లభంబు సుమ్మి;
దేవతలును నాదు దివ్యాకృతినిఁ జూడఁ
గాంక్ష ననవరతము గల్గి యుంద్రు.

(11) శ్లో॥ 53 : నాహం వేదైర్న తపసా
న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం
దృష్ట వానసి మాం యథా ॥ (నిరాకారము)

(11) శ్లో॥ 54 : భక్త్యా త్వనన్యయా శక్యః
అహమేవం విధోర్జున! ।
జ్ఞాతు ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరంతప! ॥ (పరమాత్మ, బ్రహ్మయోగము)

(11) శ్లో॥ 55 : మత్కర్మకృత్ మత్పరమో
మద్భక్తః సంగవర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు
యస్స మామేతి పాండవ! ॥ (భక్తి, బ్రహ్మ, కర్మయోగములు)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**విశ్వరూపసందర్శనయోగోనామ**
**ఏకాదశోధ్యాయః**



53. ఆ. తప మొనర్చి యైన దానంబుచే నైనఁ
గ్రతువువలన నైన శ్రుతులనైన
నిపుడు నీవు గనిన యీ విశ్వరూపంబు
దొరకు టన్న మిగుల దుర్లభంబు.

54. ఆ. వేఱుచింత లేని విధమున సర్వదా
నన్ను భక్తిఁ దలఁచు నరుల కెల్ల
సులభసాధ్య మగుదుఁ జూచుటకును బొందు
టకును దెలియుటకును సకలగతుల.

55. ఆ. కర్మలెల్ల నాకె ఘటియించి, మత్పర
త్వమున నిల్చి నాకు భక్తి సలిపి
సంగవర్జితుఁడును సర్వభూతసముండు
నైనపురుషవర్యుఁడందు నన్ను.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**పదుకొండవ అధ్యాయము విశ్వరూపసందర్శన యోగము సమాప్తము.**



## అథ ద్వాదశోధ్యాయః - భక్తియోగః

అర్జున ఉవాచ :-

(12) శ్లో॥ 1 : ఏవం సతతయుక్తా యే
భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం
తేషాం కే యోగవిత్తమాః ॥ (బ్రహ్మ, కర్మ, భక్తియోగములు)

శ్రీ భగవానువాచ :-

(12) శ్లో॥ 2 : మయ్యావేశ్య మనో యే మాం
నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాః
తే మే యుక్తతమా మతాః ॥(బ్రహ్మ, కర్మ, భక్తియోగములు)

(12) శ్లో॥ 3 : యే త్వక్షరమనిర్దేశ్యమ్
అవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగమచింత్యం
చ కూటస్థమచలం ధ్రువమ్ ॥ (మోక్షము)

(12) శ్లో॥ 4 : సంనియమ్యేంద్రియగ్రామం
సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ
సర్వభూతహితే రతాః ॥ (బ్రహ్మయోగము)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మద్భగవద్గీత

ద్వాదశాధ్యాయము.

## భక్తియోగము

అర్జునుడిట్లనియె :-

01. తే. ఇట్లు సతతంబు నిను భజియించునట్టి
భక్తజనులందు మఱియు నవ్యక్తమైన
యక్షరంబు నుపాసించునట్టి జనుల
యందు యోగవిత్తము లెవ్వరగుదురయ్య?

శ్రీ భగవంతుడిట్లనియె :-

02. ఆ. పరమశ్రద్ధ గలిగి స్వాంతంబు నాయంద
నిలిపి నిత్యయుక్తనిరతిఁ బూని
నన్నుపాసనం బనారతంబును జేయు
యోగివర్యు లెల్ల యుక్తతములు.

03. తే. అవ్యయంబు ననిర్దేశ్యమగుచుఁ, జింత
చేయరాని దై సర్వత్ర చెలఁగి, యచల
మగుచుఁ గూటస్థమును ధ్రువంబైనప్రత్య
గాత్మ దలఁచి యుపాసించునట్టివారు.

04. ఆ. ఇంద్రియముల నిగ్రహించుచు, సర్వభూ
తములయందు బుద్ధి సమముఁ జేసి
సర్వభూతహితము సల్పుచు, ననుఁ బొందు
నట్టివార లగుదు రమలచరిత!

(12) శ్లో॥ 5 : క్లేశోధికతరస్తేషామ్
అవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం
దేహవద్భిరవాప్యతే ॥ (బ్రహ్మయోగము)

(12) శ్లో॥ 6 : యే తు సర్వాణి కర్మాణి
మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన
మాం ధ్యాయంత ఉపాసతే ॥ (కర్మయోగము)

(12) శ్లో॥ 7 : తేషామహం సముద్ధర్తా
మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్
పార్థ! మయ్యావేశితచేతసామ్ ॥ (భక్తియోగము)

(12) శ్లో॥ 8 : మయ్యేవ మన ఆధత్స్వ
మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ
అత ఊర్ధ్వం న సంశయః ॥ (బ్రహ్మయోగము)

(12) శ్లో॥ 9 : అథ చిత్తం సమాధాతుం
న శక్నోషిమయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో
మామిచ్ఛాప్తుం ధనంజయ! ॥ (బ్రహ్మయోగము)

(12) శ్లో॥ 10 : అభ్యాసేప్యసమర్థోసి
మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి
కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥ (భక్తియోగము)

05. తే. అట్టు లాత్మనుపాసించునట్టి జనులు
చనెడుమార్గంబు మిగులఁగష్టంబు పార్థ !
ఇంద్రియాగోచరముగఁ జరించునాత్మఁ
జెందు టధికకష్టం బైన చేఁత సుమ్మి.

06. ఆ. సర్వకర్మములను సంపూర్ణముగ, మత్స
మర్పణం బొనర్చి మత్పరత, న
నన్యయోగసిద్ధి నభ్యాస మొనరించి
నాయుపాసనంబు సేయుజనుల.

07. తే. అర్జునా! వారు చిత్తంబులందు నన్ను
మఱవఁజాలక నాయందె మగ్ను లగుట
వారినెల్లను మృత్యుసం సారజలధి
దాఁటఁజేయుదు నేనతి త్వరితగతిని.

08. తే. మనసునం దనారతమును ననుఁ దలఁపుము;
బుద్ధియందును నన్నె సంశుద్ధిఁ గనుము;
అట్లు జేసిన, నీవు తదాది నన్నె
పొంది నాయందె నిలుతువు పుణ్యచరిత!

09. ఆ. చిత్తమును లయంబు స్థిరరీతిఁ జేయంగ
శక్తి లేనియెడల సవ్యసాచి!
యట్టిశక్తి బొందు మభ్యాసయోగంబు
చేత నన్ను స్మరణఁ జేసికొనుచు.

10. తే. అందులకును సమర్థత నందవేని
నాదుకర్మంబు సేయు మ నారతంబు;
నాకొరకుఁ గర్మములఁ జేసి నను గిరీటి!
నన్నుఁ బొందుభాగ్యము గల్గు సన్నుతముగ.

(12) శ్లో॥ 11 : అథైతదప్యశక్తోసి
కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం
తతః కురు యతాత్మవాన్ ॥ (కర్మయోగము)

(12) శ్లో॥ 12 : శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్ కర్మఫలత్యాగః
త్యాగాచ్ఛాంతిరనంతరమ్ ॥ (బ్రహ్మయోగము,కర్మయోగము)

(12) శ్లో॥ 13 : అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః
సమదుఃఖసుఖః క్షమీ ॥ (కర్మయోగము)

(12) శ్లో॥ 14 : సంతుష్టస్సతతం యోగీ
యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధిః
యో మద్భక్తస్స మే ప్రియః ॥ (కర్మయోగము)

(12) శ్లో॥ 15 : యస్మాన్నోద్విజతే లోకో
లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయోద్వేగైః
ముక్తోయస్స చ మే ప్రియః ॥ (బ్రహ్మయోగము)

(12) శ్లో॥ 16 : అనపేక్షః శుచిర్దక్షః
ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభపరిత్యాగీ
యోమద్భక్తస్స మే ప్రియః ॥ (బ్రహ్మయోగము)

11. తే. అట్టి భక్తియోగమున నన్నాశ్రయింప
శక్తిసామర్థ్యములు నీకుఁ జాలవేని
నెమ్మనముపోక లెల్లను నిగ్రహించి
యఖిలకర్మఫలత్యాగి వగుము పార్థ!

12. తే. మూఢుఁ డొనరించునభ్యాసమునకు జ్ఞాన
మున్న మేలు, ధ్యానము దాని కన్న మేలు;
ధ్యానమును మించినది ఫల త్యాగము సుమి;
జనున కట్టి త్యాగంబుచే శాంతి గల్గు.

13. తే. సర్వభూతంబులందు ద్వేషంబు లేక
కరుణ వహియించి స్నేహంబు గలిగి, మమత
విడిచి మది నహంకారంబు నుడుగఁ జేసి
సమత సుఖదుఃఖములఁ జూచి క్షమ వహించి.

14. తే. నిత్యసంతుష్టితో యోగనిరతిఁ బూని
నియమిత మనస్కుఁ డై దృఢనిశ్చయమున
బుద్ధి నాయందె నిల్పు వి శుద్ధ చరితుఁ
డైనభక్తునియందు నాకధికప్రేమ.

15. తే. జగతిచే నెట్టివానికి జడుపు లేదొ
జగతి కెవనిచేఁ గలుగదొ జడుపు, వాఁడు
హర్షమును గోపమును మనోవ్యాకులమును
భయమునుం బొంద డతడె నాప్రియుడు పార్థ!

16. ఆ. దక్షుఁడై జనుండుదాసీనుఁడై గత
వ్యథుఁడు శుచియు నగుచు వాంఛలేక
సర్వ విషయములను సంకల్పరహితుఁడై
భక్తుఁడైన, నాకుఁ బరమప్రియుఁడు

(12) శ్లో॥ 17 : యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ
భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ (కర్మయోగము)

(12) శ్లో॥ 18 : సమశ్శత్రౌ చ మిత్రే చ
తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు
సమస్సంగవివర్జితః ॥ (బ్రహ్మ, కర్మయోగములు)

(12) శ్లో॥ 19 : తుల్యనిందాస్తుతిర్మౌనీ
సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతిః
భక్తిమాన్ మే ప్రియో నరః ॥ (కర్మయోగము)

(12) శ్లో॥ 20 : యే తు ధర్మ్యామృతమిదం
యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్ధధానా మత్పరమా
భక్తాస్తేతీవ మే ప్రియాః ॥ (బ్రహ్మ, కర్మయోగములు)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**భక్తియోగోనామ ద్వాదశోధ్యాయః**

17. ఆ. సంతసంబు గనక, వంతలఁ జెందక,
ద్వేష మందక, యభిలాషి గాక,
పుణ్యపాపములను బొందక వర్జించు
భక్తుఁ డగును నాకుఁ బరమప్రియుఁడు.

18. ఆ. సమతఁ జూచుబుద్ధి శత్రుమిత్రులయందు
మానమందును నవమానమందుఁ
జలిని నుష్ణమునను సౌఖ్యదుఃఖంబుల
సంగమును ద్యజింపఁజాలువాఁడు.

19. తే. స్తుతియు నిందయు సమముగాఁ జూచి, మౌని
యగుచు లభ్యంబులకుఁ దృప్తుఁడగుచు, గృహము
లాదిగాఁ గల్గువానియందాశలేని
స్థిరమనస్కుండు నా కగు వరప్రియుండు.

20. తే. ఎవరు ధర్మ్యామృతం బగు నిట్టియోగ
మున నుపాసనఁ జేతురు ననుఁ గిరీటి!
శ్రద్ధతోడ మత్పరమైన బుద్ధి తోడ,
వారె నాభక్తవరులును వరప్రియులును.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**పన్నెండవ అధ్యాయము భక్తియోగము సమాప్తము.**

## అథ త్రయోదశాధ్యాయః - క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగః

అర్జున ఉవాచ :-

(13) శ్లో॥ 1: ప్రకృతిం పురుషం చైవ
క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ ।
ఏత ద్వేదితు మిచ్ఛామి
జ్ఞానం జ్ఞేయంచ కేశవ ! ॥ (ప్రకృతి, పురుషుడు)

శ్రీ భగవానువాచ :-

(13) శ్లో॥ 2 : ఇదం శరీరం కౌంతేయ !
క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ (ప్రకృతి, పురుషుడు)

(13) శ్లో॥ 3 : క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత ! ।
క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం
యత్తద్ జ్ఞానం మతం మమ ॥ (ప్రకృతి, పురుషుడు)

(13) శ్లో॥ 4 : తత్క్షేత్రం యచ్చ యాదృక్చ
యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ
తత్సమాసేన మే శృణు ॥ (ప్రకృతి, పురుషుడు)

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మద్భగవద్గీత

త్రయోదశాధ్యాయము.

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

అర్జునుడిట్లనియె :-

01. ఆ. క్షేత్ర మనఁగ నెద్ది? క్షేత్రజ్ఞుఁ డెవ్వండు?
ఎట్టివాఁడు పురుషుఁ? డేది ప్రకృతి?
జ్ఞానమేది? జ్ఞేయమైనది యెయ్యది?
తెలియఁజెపుము వాసు దేవ! నాకు

శ్రీ భగవంతుడిట్లనియె :-

02. తే. ఈశరీరంబు యగు క్షేత్ర మింద్రతనయ!
దీని నెవ్వం డెఱుంగునో వాని మహిని
దత్త్వవిదు లైనవారి మతం బునందుఁ
జెలఁగ క్షేత్రజ్ఞుఁ డను పేరఁ జెప్పుచుంద్రు.

03. తే. ఉర్వి నెల్ల క్షేత్రములు, నందున్న క్షేత్ర
వేత్తగాఁ గూడ నన్నె భావించుకొనుము;
ఇట్లు క్షేత్రజ్ఞు క్షేత్రంబు నెఱుకపఱచు
జ్ఞానమే యుపాదేయ మౌ జ్ఞాన మగును.

04. తే. అట్టిక్షేత్రం బ దేదియో, యెట్టి దగునొ
ఏ వికారము ల్గలదియో యేల కలదొ,
ఎవఁడు క్షేత్రజ్ఞుఁడో వానికేప్రభావ
ములు చెలంగునొ సంగ్రహముగ వచింతు.

(13) శ్లో॥ 5 : ఋషిభిర్బహుధా గీతం
ఛందోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ
హేతుమద్భిర్వినిశ్చితైః ॥ (ప్రకృతి, పురుషుడు)

(13) శ్లో॥ 6 : మహాభూతాన్యహంకారో
బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ
పంచ చేంద్రియగోచరాః ॥ (ప్రకృతి)

(13) శ్లో॥ 7 : ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం
సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్ క్షేత్రం సమాసేన
సవికారముదాహృతమ్ ॥ (ప్రకృతి)

(13) శ్లో॥ 8 : అమానిత్వమదం భిత్వమ్
అహింసా క్షాంతిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్యమాత్మవినిగ్రహః ॥ (జ్ఞానము)

(13) శ్లో॥ 9 : ఇంద్రియార్థేషు వైరాగ్యమ్
అనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధి
దుఃఖదోషానుదర్శనమ్ ॥ (జ్ఞానము)

(13) శ్లో॥ 10 : అసక్తిరనభిష్వంగః
పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమ్
ఇష్టానిష్టోపపత్తిషు ॥ (జ్ఞానము)

05. తే. మునులవలనను మఱి వేదములవలనను
హేతునిశ్చితవాదసం భూతము లగు
బ్రహ్మసూత్రపదంబుల బహువిధముల
విషయ మిది వర్ణనంబు గావింపఁబడియె.

06. ఆ. భూతపంచకంబు బుద్ధి యహంకార
మును దశేంద్రియములు మూలప్రకృతి
యింద్రియంబుల జనియించెడు విషయముల్
మఱియు వీనితోడ మన సొకటియు.

07. ఆ. సుఖము దుఃఖమును నసూయయుఁ గోర్కియుఁ
జేతనాధృతులకుఁ జేరికయును
క్షేత్ర మనఁగ నిట్లు చెప్పంగఁబడెఁ గార్య
సహిత మైన తెఱఁగుసవ్యసాచి!

08. తే. గర్వదంభంబు లనునవి గలుగకుండ
శాంతి నిష్కపటం బహింసయు వహించి
సద్గురులసేవఁ జేసి శౌ చంబుఁ బూని
కలఁత లేనట్టి యాత్మనిగ్రహము గలిగి.

09. తే. విషయసుఖములం దాసక్తి విడిచిపుచ్చి
తా నటన్నభావంబునే తలఁచు కొనక
జన్మమృతిజరారుజ్దుః ఖ సమితి నెల్లఁ
గలుగునవి పోవునవి గాఁగఁ దెలిసికొనుచు.

10. తే. రాగనిర్ముక్తుఁ డగుచు, దారసుతులందు
నర్థగృహముల సంగశూన్యత వహించి
సంభవించెడియిష్ట కష్టముల యెడల
నెప్పుడును సమచిత్తత్వమే చెలంగ

(13) శ్లో॥ 11 : మయి చానన్యయోగేన
భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమ్
అరతిర్జనసంసది ॥ (జ్ఞానము)

(13) శ్లో॥ 12: అధ్యాత్మజ్ఞాననిత్యత్వం
తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతద్జ్ఞానమితి ప్రోక్తమ్
అజ్ఞానం యదతోన్యథా ॥ (జ్ఞానము)

(13) శ్లో॥ 13 : జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి
యద్ జ్ఞాత్వామృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ
న సత్తన్నాసదుచ్యతే॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 14 : సర్వతః పాణిపాదం తత్
సర్వతోక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే
సర్వమావృత్య తిష్ఠతి ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 15 : సర్వేంద్రియగుణాభాసం
సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభోక్తృచ ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 16 : బహిరంతశ్చ భూతానామ్
అచరం చరమేవ చ ।
సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయం
దూరస్థం చాంతికే చ తత్ ॥ (పరమాత్మ)

11. తే. కడఁగి నాయం దనన్యయోగం బొనర్చి
వ్యభిచరింపనిమనసుచే భక్తి సలిపి
జనవిహీనస్థలంబులందు నివసించి
జనసమూహంబులందు నాసక్తి లేక

12. తే. ఆత్మవిషయికజ్ఞానమందాస్థ గలిగి
నిశ్చయజ్ఞానసిద్ధికై నిరతితోడ
అవని వర్తించుటే జ్ఞాన మంద్రు బుధులు;
అట్లు గానిది యజ్ఞాన మగును బార్థ.

13. తే. జ్ఞేయ మనునది విశదంబు సేసెద విను
అమృతసిద్ధికి నటు సేయుటవసరంబు;
మత్పరంబు, ననాది, బ్రహ్మంబు, దాని
పేరు సత్తు నస త్తని పిలువరాదు.

14. తే. అంతటను బాణిపాదంబు లాస్యములును
శ్రోత్రములు శిరస్సులును నక్షులుఁ జెలంగ
జగతి సర్వత్ర తానయై సర్వగతుల
వ్యాప్తి నొందుచు శుద్ధాత్మ వఱలుచుండు.

15. తే. ఆత్మ సర్వేంద్రియగుణంబు లరయఁగలిగి
యింద్రియంబుల నెల్ల వర్జించుచుండు;
సర్వభర్తృత్వము వహించు, సక్తిమాని,
భోక్తగాఁ గల్గి, గుణములు పొందు విడుచు.

16. తే. పంచభూతంబులకు వెలుపలను లోను
గదలుచుండును మఱి తానె కదలకుండు
సూక్ష్మమగుట దుస్తరము చూచుటకు దాని
జ్ఞానులకు దాపు, దవ్వు నజ్ఞానులకును.

(13) శ్లో॥ 17 : అవిభక్తం చ భూతేషు
విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చ తద్ జ్ఞేయం
గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 18 : జ్యోతిషామపి తజ్జ్యోతిః
తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృది సర్వస్య విష్ఠితమ్ ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 19 : ఇతి క్షేత్రం తథా జ్ఞానం
జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ
మద్భావాయోపపద్యతే ॥ (ప్రకృతి,పరమాత్మ)

(13) శ్లో॥ 20 : ప్రకృతిం పురుషం చైవ
విద్ధ్యనాదీ ఉభావపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ
విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ (ప్రకృతి,పరమాత్మ)

(13) శ్లో॥ 21 : కార్యకారణకర్తృత్వే
హేతుః ప్రకృతిరుచ్యతే ।
పురుషః సుఖదుఃఖానాం
భోక్తృత్వే హేతురుచ్యతే ॥ (ప్రకృతి, జీవాత్మ)

(13) శ్లో॥ 22 : పురుషః ప్రకృతిస్థోహి
భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోస్య
సదసద్యోనిజన్మసు ॥ (ప్రకృతి,జీవాత్మ)

17. తే. ఉర్వి భూతంబులన్నిట నొక్క రూప
మునఁ జెలంగియు బహురూపములను జూపు;
ఏది భూతంబులకు భర్త యేది భోక్త
ఏది హేతువౌ యదె జ్ఞేయ మెఱుకఁ గనుము.

18. తే. జ్యోతులకు నెల్ల మిక్కిలి జ్యోతి యగుచుఁ
బ్రకృతికంటెను బరమ మైపరఁగుచుండు
జ్ఞానమును జ్ఞేయమును జ్ఞాన గమ్య మగుచు
సర్వప్రాణులహృది నివాసంబు సేయు

19. తే. క్షేత్రమును జ్ఞానమును మఱి జ్ఞేయ మనఁగ
నిట్లు సంక్షేపముగ వచియింపబడియె;
బాగుగా దీనిఁ దెలిసి నా భక్త జనుఁడు
యోగ్యతను బొంది నాభావ మొందఁగలడు.

20. ఆ. పురుషుఁడును బ్రకృతియు నరయ నీరెండును
నాది లేనియట్టి వం చెఱుఁగుము;
కలిగి వెడలుగుణవికారంబు లెల్లను
బ్రభవ మందుచుండుఁ బ్రకృతివలన.

21. తే. ప్రకృతి హేతువు కార్యకారణములకును
మఱియుఁ గర్తృత్వమునకును మహినిఁ బార్థ !
పురుషుఁడన్ననొ, తా హేతుభూతుఁడగును
సుఖముదుఃఖంబు లనుభవించుటకు నెపుడు.

22. తే. ప్రకృతియం దుండి పురుషుండు ప్రకృతిసంభ
వములగుణములతోడ సంబంధ మొందు;
మంచిచెడుయోనులందు జన్మంబు లొంద
గుణములందలి సక్తి కారణ మతనికి.

(13) శ్లో॥ 23 : ఉపద్రష్టానుమంతా చ
భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో
దేహేస్మిన్ పురుషః పరః ॥ (జీవాత్మ,ఆత్మ,పరమాత్మ)

(13) శ్లో॥ 24 : య ఏవం వేత్తి పురుషం
ప్రకృతిం చ గుణైస్సహ ।
సర్వథా వర్తమానోపి
న స భూయోభిజాయతే ॥ (ప్రకృతి, పురుషుడు)

(13) శ్లో॥ 25 : ధ్యానేనాత్మని పశ్యంతి
కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన
కర్మయోగేన చాపరే ॥ (బ్రహ్మ,కర్మ,భక్తియోగములు)

(13) శ్లో॥ 26 : అన్యే త్వేవమజానంతః
శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।
తేపి చాతితరంత్యేవ
మృత్యుం శ్రుతిపరాయణాః ॥ (జీవుడు, మోక్షము)

(13) శ్లో॥ 27 : యావత్సంజాయతే కించిత్
సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్
తద్విద్ధి భరతర్షభ ! ॥ (ప్రకృతి, పురుషుడు)

(13) శ్లో॥ 28 : సమం సర్వేషు భూతేషు
తిష్ఠంతం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యంతం
యః పశ్యతి స పశ్యతి ॥ (పరమాత్మ)

23. తే. పురుషవర్యుఁడ దేహంబుఁ బొంది దాని
కగు నటందురు భోక్త నియామకుండు;
మఱి యుపద్రష్ట యుఁబరమాత్మయు నటంచు
భర్త యనుమంత యనికూడఁ బల్కఁ బడును.

24. తే. ప్రకృతిపురుషుల నీరీతిఁ బరిగణించి
గుణవిశేషము ల్చక్కఁగా గుర్తెఱుంగు
నతఁడు సర్వదా వర్తించు నాతఁడయ్యు
జన్మ మొందఁడు వేఱొండు సవ్యసాచి!

25. తే. ధ్యానయోగంబుచేతఁ గొందరు గడింత్రు;
సాంఖ్యయోగంబె కొందఱు జనులమతము;
కొంద ఱలకర్మ యోగంబు గొంద్రు, దేహ
మున వసించెడియాత్మను గనుఁగొనంగ.

26. తే. ఈ విధము కొంద ఱెఱుఁగక యితరజనుల
వలన విని యుపాసన చేసి పడయచుంద్రు;
అట్టివారును, శ్రుతిపరాయణులు గూడ,
మృత్యు సంసారమును దాఁటి మెలఁగఁగలరు.

27. తే. అవని, స్థావరజంగమంబైనజంతు
వెయ్యదియునైన నెట నుద్భవించె నన్నఁ
బ్రకృతిపురుషులయొక్క సంబంధముననె
కలుగవలెఁ గాని వేఱొండు గాదు పార్థ !

28. తే. ఎల్ల భూతంబులందుఁ దానీశ్వరత్వ
మును వహించుచు నధికారమున వసించి,
చెడుగు నవి చెందినను, దాను జెడనియాత్మ
కెల్లయెడల సమత్వమే యెంచవలయు.

(13) శ్లో॥ 29 : సమం పశ్యన్ హి సర్వత్ర
సమవస్థితమీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాత్మానం
తతో యాతి పరాం గతిమ్॥ (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ)

(13) శ్లో॥ 30 : ప్రకృత్యైవ చ కర్మాణి
క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాత్మానమ్
అకర్తారం స పశ్యతి ॥ (ప్రకృతి, పరమాత్మ)

(13) శ్లో॥ 31 : యదా భూతపృథగ్భావమ్
ఏకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం
బ్రహ్మ సంపద్యతే తదా ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 32 : అనాదిత్వాన్నిర్గుణత్వాత్
పరమాత్మాయమవ్యయః ।
శరీరస్థోపి కౌంతేయ !
న కరోతి న లిప్యతే ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 33 : యథా సర్వగతం సౌక్ష్మ్యాత్
ఆకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే
తథాత్మా నోపలిప్యతే ॥ (పరమాత్మ)

29. తే. ఎవఁడు గనుఁగొని సమునిఁగా నెల్ల దేహ
ముల వసించెడియీశ్వరమూర్తి నెంచు
వానియాత్మకు మనసుచే బాధ లేదు;
ఉత్త మపదంబుఁ బిదప వాఁడొందఁగలఁడు.

30. తే. సర్వకర్మలు ప్రకృతిచే జరుపఁబడెడి
వనుచు నెవ్వం డెఱుంగునో యట్టివాఁడు
కర్త, యేకార్యమున కాత్మ గాదటంచుఁ
దెలిసికొనఁ గల్గు; సరియైన తెల్వి యదియె.

31. తే. ఎవుడు భూతభేదంబులనెల్ల నొక్క
దానియందలి వనియు, విస్తారములును
దాని వే యంచుఁ దెలియునో వాని కపుడు
బ్రహ్మసాధర్మ్య సంపదఁ బడయఁగల్గు.

32. ఆ. ఆదిశూన్యుఁ డగుచు నవ్యయుండును గుణ
త్రయవిహీనఁ డగుటఁ దనువునందు
నున్న నేమి? కర్మ లొనరింపఁ డాతండు;
అట్టివానిఁ దగుల వవియు బార్థ!

33. ఆ. అఖిలవస్తుజాలమాక్రమించియు సూక్ష్మ
మగుట, నాకసమున కంటు లేదు;
ఆట్లె భూతజాలమందెల్ల వ్యాపించు
నాత్మ దేనిఁగాని యంటకుండు.

(13) శ్లో॥ 34 : యథా ప్రకాశయత్యేకః
కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం
ప్రకాశయతి భారత ! ॥ (పరమాత్మ)

(13) శ్లో॥ 35 : క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమ్
అంతరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం
చ యే విదుర్యాంతి తే పరమ్ ॥ (ప్రకృతి, పురుషుడు)

**ఓం తత్సదితి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు**
**బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే**
**క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగోనామ**
**త్రయోదశోధ్యాయః**



34. ఆ. ఎట్లు సూర్యుఁ డొక్కఁడీలోకమెల్లఁ బ్ర
కాశ మొందఁ జేయఁ గలఁడొ, యట్లె
యాత్మ తనదు దేహ మంతయు వ్యాపించి
వెలుఁగుఁ బుట్టఁజేయఁ గలుగు బార్థ!

35. తే. జ్ఞాననేత్రంబుచే, నెట్టి జనులు ప్రకృతి
పురుషులకుఁ గల భేదంబు భూతజాల
ముల స్వభావంబు మోక్షంబుఁ దెలియఁగలరొ,
వారు బ్రహ్మసాధర్మ్యంబుఁ బడయఁగలరు.

**బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలోని**
**పదమూడవ అధ్యాయము క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము సమాప్తము.**



## అథ చతుర్ధశోధ్యాయః - గుణత్రయ విభాగయోగః

శ్రీ భగవానువాచ :-

(14) శ్లో॥ 1 : పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే
పరాం సిద్ధిమితో గతాః ॥ (జ్ఞానము)

(14) శ్లో॥ 2 : ఇదం జ్ఞానముపాశ్రిత్య
మమ సాధర్మ్యమాగతాః ।
సర్గేపి నోపజాయంతే
ప్రళయే న వ్యథంతి చ ॥ (జ్ఞానము)

(14) శ్లో॥ 3 : మమ యోనిర్మహద్బ్రహ్మ
తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవః సర్వభూతానాం
తతో భవతి భారత ! ॥ (ప్రకృతి, పరమాత్మ)

(14) శ్లో॥ 4 : సర్వయోనిషు కౌంతేయ !
మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః
అహం బీజప్రదః పితా ॥ (ప్రకృతి, పరమాత్మ)

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీమద్భగవద్గీత

చతుర్దశాధ్యాయము.

## గుణత్రయ విభాగ యోగము

శ్రీ భగవంతుడిట్లనియె :-

01. తే. మరలఁ జెప్పెద నర్జునా! పరమ మైన
జ్ఞానములలోన నుత్తమ జ్ఞానపథము
నెల్ల మునివర్యులును దానినెఱిఁగి గాదె
పడయ నేర్తు రజస్రంబు పరమసిద్ధి.

02. తే. ఇట్టి జ్ఞానంబు నెవ రాశ్రయించుచుందు
రట్టివారు నాసాధర్మ్యమంద గలిగి
సృష్టియందును జన్మంబుఁ జెందఁబోరు
ప్రళయమందును దుఃఖంబుఁ బడయఁబోరు.

03. ఆ. ఈ యచేతనప్రకృతి నాదుయోని యౌ;
దాని కేన బీజదాత నగుదు;
అటులె భూతజాలమగుచుండు నుద్భవం
బనుచు నెఱుఁగవలయు నవని, బార్థ !

04. ఆ. సర్వయోనులందు సంభవించుచు నుండు
సకలభూతములకు సవ్యసాచి!
మాత మూలప్రకృతి; మఱి బీజదాత నౌ
నేను దండ్రి నంచు నెఱుఁగవలయు.

(14) శ్లో॥ 5 : సత్త్వం రజస్తమ ఇతి
గుణాః ప్రకృతిసంభవాః ।
నిబధ్నంతి మహాబాహో!
దేహే దేహినమవ్యయమ్ ॥ (జీవుడు, మూడుగుణములు)

(14) శ్లో॥ 6 : తత్ర సత్త్వం నిర్మలత్వాత్
ప్రకాశకమనామయమ్ ।
సుఖసంగేన బధ్నాతి
జ్ఞానసంగేన చానఘ ! ॥ (జీవుడు, సాత్త్వికము)

(14) శ్లో॥ 7 : రజో రాగాత్మకం విద్ధి
తృష్ణాసంగసముద్భవమ్ ।
తన్నిబధ్నాతి కౌంతేయ !
కర్మసంగేన దేహినమ్ ॥ (జీవుడు, రాజసము)

(14) శ్లో॥ 8 : తమస్త్వజ్ఞానజం విద్ధి
మోహనం సర్వదేహినామ్ ।
ప్రమాదాలస్యనిద్రాభిః
తన్నిబధ్నాతి భారత ! ॥ (జీవుడు, తామసము)

(14) శ్లో॥ 9 : సత్త్వం సుఖే సంజయతి
రజః కర్మణి భారత ! ।
జ్ఞానమావృత్య తు తమః
ప్రమాద సంజయత్యుత ॥ (జీవుడు, మూడుగుణములు)

(14) శ్లో॥ 10 : రజస్తమశ్చాభిభూయ
సత్త్వం భవతి భారత ! ।
రజఃసత్త్వం తమశ్చైవ
తమః సత్త్వం రజస్తథా ॥ (జీవుడు, మూడుగుణములు)

05. ఆ. సవ్యసాచి! జీవుండవ్యయుం డయ్యును
సాత్త్వికంబు రాజసంబు తామ
సంబు లనెడిప్రకృతి జనితత్రయంబుచే
బంధ మొందు దేహ బద్ధుండగుట.

06. ఆ. సత్త్వగుణము నిర్మలత్వంబుచేం బ్రకా
శంబు మఱి యనామయంబు నొంది
జ్ఞానసుఖములందు సంగంబు గల్పించి
బంధనం బొనర్చుంబార్థ ! నరుని.

07. ఆ. రాజసంబు మహిని రాగాత్మకం బౌచు
విషయకాంక్ష లెల్ల వృద్ధిం జేయు;
కర్మలందు సక్తి గల్పించి నరునకు
బంధనం బొనర్చుం బార్థ! వాని.

08. తే. జ్ఞానశూన్యత చేం దామసంబు గలిగి
మోహమున సర్వదేహులముంచి వైచు;
అర్జునా; యలసత్వ నిద్రాదులందె
దేహులను జిక్కంబట్టి బంధించుచుండు.

09. తే. సక్తి సుఖమునం గల్గించు సత్త్వగుణము;
రాజసం బిచ్చుం గామ్యకర్మముల రక్తి;
జ్ఞానమును గప్పి విపరీత కర్మలందు
మమతం గల్గించు నెపుడుం దామసము పార్థ!

10. తే. సత్త్వ మొక్కడ మించు రాజసతమముల;
నట్లె మఱియొక్క యెడ రజం బధిక మగుచు
సత్త్వతామసముల మించు; సత్త్వరాజ
సముల వేఱొకయెడం దామసంబు మించు.

(14) శ్లో॥ 11 : సర్వద్వారేషు దేహేస్మిన్
ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యాత్
వివృద్ధం సత్త్వమిత్యుత ॥ (జీవాత్మ, సాత్త్వికము)

(14) శ్లో॥ 12 : లోభః ప్రవృత్తిరారంభః
కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయంతే
వివృద్ధే భరతర్షభ ! ॥ (జీవాత్మ, రాజసము)

(14) శ్లో॥ 13 : అప్రకాశోऽప్రవృత్తిశ్చ
ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయంతే
వివృద్ధే కురునందన ! ॥ (జీవాత్మ, తామసము)

(14) శ్లో॥ 14 : యదా సత్త్వే ప్రవృద్ధే తు
ప్రళయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకాన్
అమలాన్ ప్రతిపద్యతే ॥ (జీవాత్మ, సాత్త్వికము)

(14) శ్లో॥ 15 : రజసి ప్రళయం గత్వా
కర్మసంగిషు జాయతే ।
తథా ప్రలీనస్తమసి
మూఢయోనిషు జాయతే ॥ (జీవాత్మ,రాజసము,తామసము)

(14) శ్లో॥ 16 : కర్మణః సుకృతస్యాహుః
సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజసస్తు ఫలం దుఃఖమ్
అజ్ఞానం తమసః ఫలమ్ ॥ (జీవుడు, మూడుగుణములు)

11. తే. దేహమందలియెల్ల యిం-ద్రియములందు
నున్న దున్నట్లు తెలియుజ్ఞానోద్భవం బ
దెపుడు కన్పట్టునో యప్పండే యతనికి
వృద్ధియగు, సత్త్వగుణ మటం చెఱుఁగవలయు.

12. తే. లోభగుణము, వృథాచేష్టలును, ఫలాశ
తోడికర్మంబులు, నశాంతి గూడియుండు,
లోప మొందుట, యవి పొడ సూపునపుడె
వృద్ధియగు, రజోగుణ మని యెఱుఁగవలయు.

13. తే. అప్రకాశంబు మోహంబు నప్రవృత్తి
మఱి యకార్యంబు లొనరింప మనసు చనుట
యెపుడు పొడసూపునో యప్పుడే నరునకు
వృద్ధి యగుఁ దమోగుణ మంచు నెఱుఁగవలయు.

14. ఆ. సత్త్వగుణము వృద్ధిఁ జరియించుచుండఁగా
మరణ మొందునట్టి మానవులకు
మరలఁ గల్గు నుత్తమ జ్ఞానవంతుల
శుద్ధలోక సిద్ధి యిద్ధచరిత!

15. ఆ. నలిరజోగుణంబునం జచ్చునరునకుఁ
గర్మసంగ మెపుడుఁ గల్గుచుండు;
తమము వృద్ధిఁ జెందు తఱి మరణించువాఁ
డుద్భవించు మూఢయోనులందు.

16. తే. సత్కృతం బగుకర్మంబు సాత్త్వికమును
నిర్మలమునైనఫలము జనింపఁ జేయు;
వ్యసనమే యుద్భవించు రాజసము వలనఁ;
దామసము చేత నజ్ఞాన తతయె కల్గు.

(14) శ్లో॥ 17 : సత్త్వాత్ సంజాయతే జ్ఞానం
రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో
భవతోఽజ్ఞానమేవ చ ॥ (జీవుడు, మూడుగుణములు)

(14) శ్లో॥ 18 : ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః
మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థాః
అధో గచ్ఛంతి తామసాః ॥ (జీవుడు, మూడుగుణములు)

(14) శ్లో॥ 19 : నాన్యం గుణేభ్యః కర్తారం
యదా ద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి
మద్భావం సోఽధిగచ్ఛతి ॥ (జీవుడు, మూడుగుణములు)

(14) శ్లో॥ 20 : గుణానేతానతీత్య త్రీన్
దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైః
విముక్తోఽమృతమశ్నుతే ॥ (జీవుడు, మూడుగుణములు)

అర్జున ఉవాచ :-

(14) శ్లో॥ 21 : కైర్లింగైః త్రీన్ గుణానేతాన్
అతీతో భవతి ప్రభో! ।
కిమాచారః కథం చైతాన్
త్రీన్ గుణానతివర్తతే ॥ (యోగి)

17. తే. జ్ఞాన మావిర్భవం బొందు సాత్త్వికమున;
రాజసగుణంబు లోభమే ప్రబలఁ జేయు;
దామసం బున్నచోఁ బ్రమాదంబు మఱియు
భ్రాంతియును జ్ఞానశూన్యంబుఁ బ్రభవ మొందు.

18. తే. జన్మజన్మంబు బంధమోక్షం బొనర్ప
నుత్తమపదంబు సాత్త్వికులొందుచుండ్రు;
కలుగు సంసారమే రాజసులకు; నీచు
లైనతామసజనులకౌ నధమగతియె.

19. ఆ. కర్త వేఱొకండు గాఁడు గుణంబులే
కర్త లంచు నెపుడు గనునొ ద్రష్ట
తద్గుణములు వేఱు తానువేఱని యప్డు
వాఁ డెఱింగి నాదుభావ మొందు.

20. తే. దేహమం దుద్భవించెడు త్రిగుణములను
దేహి గనుఁగొని వాని నతిక్రమించి
జన్మమృత్యు జరాదుఃఖ జాల మెల్ల
విడిచి శుద్ధాత్మరూపంబుఁ బడయుచుండు.

అర్జునుడిట్లనియె :-

21. ఆ. దేవదేవ! యిట్టి త్రి గుణంబులను మించు
నరున కెట్టి లక్షణములు వలయు?
నతని కుండవలయునాచార మెది? యెట్లు
త్రిగుణముల నతం డత్రికమించు?

శ్రీ భగవానువాచ :-

(14) శ్లో॥ 22 : ప్రకాశం చ ప్రవృత్తిం చ
మోహమేవ చ పాండవ! ।
న ద్వేష్టి సంప్రవృత్తాని
న నివృత్తాని కాంక్షతి ॥ (యోగి)

(14) శ్లో॥ 23 : ఉదాసీనవదాసీనో
గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తంత ఇత్యేవ
యోవతిష్ఠతి నేంగతే ॥ (యోగి)

(14) శ్లో॥ 24 : సమదుఃఖసుఖః స్వస్థః
సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరః
తుల్యనిందాత్మసంస్తుతిః ॥ (యోగి)

(14) శ్లో॥ 25 : మానావమానయోస్తుల్యః
తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ
గుణాతీతః స ఉచ్యతే ॥ (యోగి)

(14) శ్లో॥ 26 : మాం చ యోవ్యభిచారేణ
భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్
బ్రహ్మభూయాయ కల్పతే ॥ (సాకార, నిరాకారములు)

శ్రీ భగవంతుడిట్లనియె :-

22. తే. తనకు సంప్రాప్త మౌపదార్థ ముల యెడల
నగుప్రకాశ ప్రవృత్తి మోహములయందు
నెవcడు ద్వేషంబు గొనcడొ; నివృత్తియైన
వాని నెవ్వcడు మరలc గావలయు ననcడొ.

23. తే. సర్వవిషయంబులం దటస్థత వహించి
యెవcడు గుణములచేc జలియింపc బడcడొ
ప్రతిదియును గుణములప్రవర్తనమె యంచుc
దలcచి యెవ్వనిబుద్ధి నిశ్చలతc గనునొ.

24. తే. సుఖము దుఃఖంబు సమముగాc జూచు నెవcడు
స్వర్ణ లోష్ట శిలల్ గను సమత నెవcడు
తుల్యుc డై ప్రీతి యప్రీతి స్తుతియు నింద
యెల్లc గని స్థిరచిత్తుc డై యెసcగు నెవcడు

25. తే. అరుల మిత్రుల మఱియు మా నావమాన
ముల నెవండు సమంబుగాc దలcచుచుండు
నెల్ల కామ్యకర్మములc ద్యజించు నెవ్వc
డట్టివాcడు గుణాతీతుcడనcగ జెల్లు.

26. తే. వ్యభిచరింపని మనసుతోc బరమభక్తి
నెవcడు సేవించు నన్నెప్పు డింద్రతనయ!
వాcడు త్రిగుణంబులం గెల్చి బ్రహ్మభూతుc
దగుట కెల్ల సమర్థత లందcగలడు.

